# ఉదయం




యువభారతీయుల కథల సంపుటి

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# ఉదయ్య

యువభారతీయుల కథల సంపుటి

ప్రచురణ :



రిజిష్టరు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

UDAYAM
AN ANTHOLOGY OF STORIES

యువభారతి

ప్రచురణ : 14

ప్రథమ ముద్రణ : 1,000

అక్టోబరు 7, 1973

ముఖపత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్,
హైదరాబాదు-500020.

మఖమల్ ప్రింటింగ్ :
రాయల్ ప్రింటింగ్ హౌస్, కాకినాడ.

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.

కార్యాలయం :

యువభారతి

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001.

వెల : రెండు రూపాయలు

# ప్రస్తావన



సాహిత్య చైతన్యంలో దివారాత్రులు పెంచుకుంటున్న నవాలోకనంలో, సహృదయలోకం చూపుతున్న ఆదరణతో, యువభారతి పదోవసంతంలో ప్రవేశించింది. మా ఈ దశమ వార్షికోత్సవ సందర్భంలో యువభారతి సభ్యులలో పదిమంది కథలను 'ఉదయం' అనే కథాసంకలనంగా రూపొందించి విజయ దశమి కానుకగా సహృదయలోకానికి సమర్పిస్తున్నందుకు ఆనందిస్తున్నాం.

యువభారతీయులలో నిగూఢంగా దాగియున్న నిర్మాణాత్మక ప్రతిభా సామర్థ్యాలను, వారి రచనాశక్తిని ప్రగతిపథం వైపు ప్రసరింప జేయాలనే సంకల్పంతో యువభారతి తన అయిదవ వార్షికోత్సవ సందర్భంగా "వీచికలు" అష్టమవార్షికోత్సవ సందర్భంగా 'అక్షరాలు', ఈ పదోవసంతంలో ఉగాది కానుకగా 'స్వరాలు' అనే కవితాసంకలనాలను రసజగత్తుకు బహుకృతిగానిచ్చింది. ఇవన్నీ యువభారతీయుల కవితా చైతన్యానికి సంకేతాలు. ఈ 'ఉదయం' వారి కథా రచనా ప్రతిభకు ఒకప్రతీక. మాకన్నివేళలా అన్నివిధాలా అండగా నిలిచిన ఆప్తులు, ప్రసిద్ధకథకులు, యువభారతి గౌరవసభ్యులు అయిన శ్రీ శీలావీర్రాజు గారి కథనుకూడా ఇందులో పొందుపరచుకోగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాం. గతంలో యువభారతి 'పంచవటి' అనేపేరుతో ప్రసిద్ధ కథకుల కథాసంకలనాన్ని వెలువరించింది. కాని యువభారతీయుల కథాచైతన్యాన్ని ఈ విధంగా సమీకరించలేదు.

ఈ రీతిగా యువభారతీయుల కథా సంకలన ప్రచురణలో ఈ 'ఉదయం' మొదటిది. ఈ దశమ వసంత ప్రచురణల్లో నాల్గవది. ఈ సంస్థ ప్రచురణల్లో పధ్నాలుగవది. మొన్న ఉగాది కానుకగా 'స్వరాలు' పలికిన సందర్భంలో కథారచనాసక్తిగల యువభారతీయులు కొందరు ఒక కథా సంకలనాన్ని గూడ వెలువరించాలనే అభిప్రాయం వ్యక్తంచేశారు. అన్నిరకాలుగా అండదండలందించారు. వారికోరిక ఈ విజయదశమి పర్వంనాటికి ప్రచురణభాగ్యాన్ని

సాధించినందుకు హృదయపర్వంగాఉంది. ఈ 'ఉదయం' లోని కథకులలో పత్రికాముఖంగా పరిచయమైనవారున్నారు. హృదయంలో ఇపుడిపుడే ఉదయస్తున్న అరుణారుణ కథారాగాన్ని అందరికీ పంచాలనే ఆసక్తిగలవారున్నారు. ఈ కథాసంకలనం రచయితలకు సంతృప్తినీ, ప్రోత్సాహాన్నీ కలిగించడంతో పాటు సహృదయాలను రంజింపజేయగలిగితే విజయదశమినాటి ఈ ప్రయత్నం అక్షరాలా విజయవంతమైనట్లుగా భావిస్తాం.

ఈ శుభసమయంలో యువభారతీయుల ఈ 'ఉదయం' తో పాటు, సాహితీమిత్రుల కథాసంకలనం 'కథావాహిని' రెండుభాగాలను ఆవిష్కరించడానికి సౌహార్దంతో సమ్మతించిన సౌజన్యమూర్తులు, సుప్రసిద్ధ పాత్రికేయులు శ్రీ రావూరి వేంకట సత్యనారాయణ రావుగారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన సాహిత్యబంధువులు శ్రీ బి. ఆర్. శాస్త్రిగారికి, ముఖ్య అతిథులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ సంకలనంలో ప్రచురించడానికి తమ రచనల నందించడమే కాక ఆర్థికంగాతోడ్పడిన 'ఉదయం' కథకులకు మా హార్దిక కృతజ్ఞతలు.

యువభారతీయుల కలాలు పలికిన ఈ కథాకళిని-వానిరవళిని విని, ఓపిక మేరకు రూపురేఖలు సవరించి, ఈ సంకలన ముఖపత్రాన్ని సౌందర్యసమంచితంగా అలంకరించిన శ్రీ శీలావీర్రాజు గారికి, మా ప్రయత్నాన్ని పరమసన్నిహితంగా పర్యవేక్షించి ఆత్మీయంగా సహకరించిన ఆప్తులు, యువభారతి ప్రధాన సంపాదకులు డా॥ జి వి. సుబ్రహ్మణ్యం గారికి, యువభారతి అధ్యక్షులు శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి, సంకలనాన్ని సంకల్పించిన నాటినుండి. సహృదయ లోకానికి సమర్పించేదాకా సర్వాన్ని నిర్వహించిన యువభారతి సమావేశకర్తలు శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికి మా ధన్యవాదాలు.

ముఖచిత్రం అచ్చొత్తిన విస్టాస్ ప్రింటర్స్‌వారికి, 'ఉదయం' అక్షరాలను అందంగా ముద్రించి అదనుకు అందించిన రాయల్ ప్రెస్ హౌస్, కాకినాడ వారికి, సకాలానికి కథాసంకలనాన్ని అచ్చువోసిన నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, శ్రీ ఎన్.వి. నారాయణ గారికి కృతజ్ఞులం.

వ్యక్తిలో మొగ్గలాఉన్న రచనా వ్యాసంగాన్ని ముగ్ధమోహనంగా వికసింపజేసి వారి ప్రతిభా పరిమళాన్ని పదిమంది సహృదయులకు పంచిపెట్టాలని, ఈ

విధంగా సాత్వికోద్యమం ద్వారా సాహితీ రసికతను పెంపొందిస్తూ సమాజాన్ని మరింత ఉజ్జ్వల భవితవ్యంవైపు పయనింపజేయాలని యువభారతి ప్రయత్నం. ఈ ప్రయత్నం ఫలోన్ముఖమైతే ప్రతి వసంతాన్ని ఒక కవితాసంకలనంతో ఆహ్వానించడంతోపాటు, ప్రతి దసరాకు రసికజగత్తుకు ఒక కథా సంకలనాన్ని కానుకగా ఇవ్వాలని ఉవ్విళ్ళూరుతున్నాం. రసజ్ఞలోకం మా హృదయాన్ని అర్థం చేసుకొని ఆదరిస్తుందని మా ఆరంభాలను అర్థవంతం చేస్తుందని ఆశిస్తున్నాం.

విజయదశమి
7-10-1973

తిరుమల శ్రీనివాసాచార్యులు
విశ్వనాథ సూర్యనారాయణ
యువభారతి

# పరిచయాలు

## నాగినేని భాస్కరరావు

జననం: 1-11-1949. స్వస్థలం: బనిగండ్లపాడు, ఖమ్మంజిల్లా. గాంధీ వైద్య కళాశాల, హైదరాబాదులో యం.బి.బి.ఎస్. ఫైనల్ ఇయర్ విద్యార్థి. 'అక్షరాలు', 'స్వరాలు' కవుల్లో ఒకరు.

## సుధామ

జననం: 1951. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్.ఏ. (తెలుగు) చదువుతున్నారు. 'పీచికలు', 'అక్షరాలు', స్వరాలు' కవుల్లో ఒకరు.

## అక్కిరాజు జనార్దనరావు

స్టేట్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరోలో సబ్-ఎడిటర్‌గా పనిచేస్తున్నారు. విద్యార్హతలు: బి.ఎ; డి.జె.

## రెడ్డి రాఘవయ్య

జననం: 1940. స్వస్థలం: ప్యాపర్రు, తెనాలితాలూకా. ఎస్.ఎస్.ఎల్.సి. చదివారు. హిందుస్థాన్ ఏరోనాటిక్స్(హైదరాబాదు)లో టెక్నిషియన్‌గాపనిచేస్తున్నారు.

## కె. సత్యవతి

వయస్సు: 20 సం॥ స్వస్థలం: హైదరాబాదు. బి.ఎస్సీ (హోమ్ సైన్స్) పట్టభద్రులు. 'స్వరాలు' కవుల్లో ఒకరు.

## చేగొండి రామజోగయ్య

జననం: 1945; విద్య: బి.ఎస్సీ. ఎల్.ఎల్.బి. ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోపరేటివ్ బ్యాంకులో పనిచేస్తున్నారు.

## జీడిగుంట కామేశ్వరరావు

జననం: అగస్టు 1951. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఎమ్.ఎస్సీ పట్టభద్రులు. ప్రస్తుతం యెల్లారెడ్డి జూనియర్ కళాశాలలో భౌతికశాస్త్రాధ్యాపకులుగా ఉంటు న్నారు. 'స్వరాలు' కవుల్లో ఒకరు.

## ఎమ్. రత్నమాల

వయస్సు: 22 సం॥ స్వస్థలం: సూర్యాపేట, బి.ఏ. చదివారు. 'అక్షరాలు', 'స్వరాలు' కవుల్లో ఒకరు.

## విశ్వనాథ సూర్యనారాయణ

జననం: సెప్టెంబరు, 1952. స్వస్థలం: సుంకెఅగ్రహరం, పార్వతీపురం తాలూకా, శ్రీకాకుళం జిల్లా. బి.ఎస్సీ. పట్టభద్రులు. 'అక్షరాలు', 'స్వరాలు' కవుల్లో ఒకరు.

## ఇరివెంటి కృష్ణమూర్తి

జననం: 1930. స్వస్థలం: మహబూబునగరము. ఉస్మానియా, విశ్వవిద్యాలయం ఎమ్, ఏ. (తెలుగు) పట్టభద్రులు. సికింద్రాబాదు సాయంకళాశాలలో ఆంధ్రో పన్యాసకులు.

'వీచికలు' 'అక్షరాలు' 'స్వరాలు' కవుల్లో ఒకరు.

# అనుక్రమణిక

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# న్యాయాన్వేషణ

నాగినేని భాస్కరరావు

"మంచికోసమని మనిషిచేసిన ప్రయత్నాలు ఎన్ని మట్టిపాలు కాలేదు? మంచి కోసమని ఎన్ని మంటలు రగులలేదు? మిగిలింది బూడిద. సంఘంలో ఒకమూల బాగు పడిందా! తక్కినచోటు సంగతి ఏమిటి? సర్వసౌభ్రాతృత్వమని, సర్వసమానత్వమని పౌరహక్కులని మొదలైనవి వేదికల కుత్తుకలమీద, పుస్తకాల గుండెలమీద నాట్యం చేస్తున్నాయి. అవి ప్రజలలో మిళితం కానంతవరకు, ప్రజల పాట్లకు తగినంత ఫలితాన్ని అందించలేకపోయినంతవరకు అవి నిష్ప్రయోజనంకాక మరేమిటి? న్యాయం ఎక్కడ? రంగా! ఇంతా చేతులు ముడుచుక్కూర్చుని లాభంలేదు. పరిష్కారమార్గం ఆలోచించాలి."

అన్న రాముడి మాటలకు శ్రోతలలో చలనం కలిగింది. రాముడు వాళ్ళందరికీ మార్గదర్శకునిలాంటివాడు. అక్కడి శ్రోతలు రామునిలాంటి బీదవాళ్ళు, ధనవంతులనే రోడ్డురోలర్ల అడుగునపడి నలిగిపోతున్న నత్తలు.

'పరిష్కారం ఏమిటి?'

"దాన్ని గురించి ఆలోచించడానికేముంది, సమ్మెచేద్దాం' అన్నాడు రాముడికేసి చూస్తూ రంగడు.

"అవునులే రంగా! ఈ ప్రజాస్వామ్యంలో నీళ్ళకన్నా, గాలికన్నా అతిచౌక అయింది, తేలికయిందికదూ సమ్మెచేయడమనేది! చేద్దాం, మనమంతా సమ్మెచేద్దాం! ఎవరి మీద? మనలను పుట్టించిన దేవునిమీదనా? మన తలిదండ్రులమీదా? ఆశమీదా? అధికారం మీదా? ఎవరిమీద?" అన్నాడు ధర్మరాజు.

రాముడు, రంగడు, ధర్మరాజు ముగ్గురూ ఆప్తమిత్రులు. ఒక సమస్యా పరిష్కారానికై ఆలోచిస్తున్నారు. ఈ సమస్యను పెద్ద సమస్య అని ఎందుకనాలంటే దాదాపు ప్రపంచం పుట్టిన దగ్గరినుండి కాస్తోకూస్తో ఈ సమస్య అనేది ఉంటూ వచ్చింది. దాన్ని పరిష్కరించివేయాలని ఎందరో ప్రయత్నించడం, కొంత సాఫల్యం లభించినా ఈ సమస్యకు పరిపూర్ణంగా పరిష్కారంలేదు. వీళ్ళిలా సమావేశం కావడానికి కథ కొంచ మయినా విన్పిస్తే పరిస్థితి అవగాహనకు వీలవుతుంది.

* * * *

రంగాపురాన్ని లక్ష్మీదేవి ఎప్పటినుండో అంటిపెట్టుకొని ఉందని ఊళ్ళో కొంత మంది గాఢాభిప్రాయం. 10 వేల ఓటర్లకుపైగా వున్న ఆ రంగాపురంలో మోతుబరి రైతులు ఎక్కువలేరు. ఉన్నవాళ్ళుమాత్రం ఊరిపెత్తనంలో పాతుకుపోయి వున్నారు.

కాని ఊళ్ళో పార్టీలు ఎక్కువ. కులం నెపంగా కొన్ని పార్టీలు, మతంపేరిట కొన్నిపార్టీలు రాజకీయంగా కొన్ని పార్టీలు. ఇటువంటివాటిని మించిన ప్రధాన తెగ లేక పార్టీ అదే బీద, ధనికవర్గాలు. అధికారపరంగా రెండు గ్రూపులక్కడ వెలుగుతున్నాయి.

బలాబలాలను తేల్చుకోవడానికి అధికారపక్షమూ, అనధికారపక్షమూ ఎదురు చూస్తున్నాయి. అధికారవర్గానికి రమణయ్య నాయకుడైతే, అనధికారపక్షానికి రామానుజులు నాయకుడు. మూడోకంటివాడికి తెలియకుండా రమణయ్య, రామానుజులు ఇద్దరూ ఒకరినొకరు హతం చేసుకోవాలని ప్రయత్నాలు చేస్తున్నారు.

"రక్తం మరక క్రింద పడకుండా గొంతు పిసికిచంపాలి గంగులూ! నా కిందివాడు నా మోచేతి క్రింది నీళ్ళు త్రాగినవాడు అధికారం చెలాయిస్తుంటే నేను చూడలేను. వాడి అంతాన్ని తేల్చు గంగులూ ఇవిగో...!" రామానుజులు జేబులోంచి విసరిన నోట్లకట్టను పట్టుకొని—

"హ్హా! హ్హా! హ్హా! దొరా! నీకేం బయంలేదు. నాయాల్ని కత్తివేటుకొక ముక్కగా నరుకుతాను. ఆ బారం మీరు నామీద వదిలేయండి! రమణయ్య ముఠానంతా చీమల దండును కాలరాచినట్లు నలిపేస్తాను. మరి తవరే పూనుకోవాలి. వచ్చే ఎన్నికల్లో తవరు గెల్వాలంటే ఆలోచించుకోండి. వస్తా" అన్నాడు గంగులు.

తలపంకించిన రామానుజులు 'గంగులూ! మంచిది. ఎలక్షన్ల ఫలితం తెలిసాక వాడిని చూద్దువుగానిలే' అన్నాడు. గంగులు సరేనంటూ వెళ్లిపోయాడు.

* * * *

ఎన్నికల ప్రచారం జోరుగాసాగింది. రూపాయల గలగలలో పీపాలకొద్దీ సారాయి ఖర్చయింది. రోజు కూలీలకు ఆ నాల్గునాళ్ళూ పండుగలా గడిచింది.

ఆరోజు ఎన్నికల ఫలితాలు తెలిసినరోజు. రమణయ్య మళ్ళీ పంచాయతీ ప్రెసిడెంటుగా ఎన్నికయినరోజు. రామానుజులు తలపట్టుక్కూర్చున్న రోజు. రమణయ్య వాగ్దానాలనుమర్చిపోవడం మొదలుపెట్టినరోజు.రామానుజులి పగ మంటలుగా మారినరోజు.

ఆరోజు రాత్రి నిద్రాదేవి ఊళ్ళో సంచరిస్తున్న సమయాన ఊరికి ఉత్తరంగా, రమణయ్య మేడకు దూరంగావున్న దాదాపు 500 పూరిండ్ల మధ్య మంటలు లేచాయి. "మంటలు! మంటలు!! ఇండ్లకు నిప్పుపెట్టారు" అంటూ రాముడు, రంగడు, ధర్మరాజు, వారందరూ కంగారుగా గోచీలు బిగించి మంటలను ఆర్పడానికి ప్రయత్నించారు. కాని—

పిల్లల ఏడ్పుల్లో, ఆడవారి ఆక్రందనల్లో, ఎండిపోయిన గొంతుల అరుపుల్లో, పశువుల అంబారావాలలో, తాళ్ళుతెంచుకొని పారిపోతున్న గొడ్ల పరుగుల చప్పుళ్ళలో, బిక్కచచ్చిన ముసలివారి దిగజారిన గుండె మూల్గులలో... ఇంట్లోనుండి సామాను తేవాలన్న ఆదుర్దాతో పరుగెత్తే వాళ్ళ తత్తరపాటులో... ఆ పూరిండ్లు, పగలంతా ఎండకు ఎండిన ఆ పూరిగుడిసెలు— అగ్నిదేవుని తాపానికి, రామానుజులి కోపానికి, రమణయ్య మనస్తాపానికి భగభగా మండిపోయాయి విరిగిన వెన్నెముకలా కాలిన పూరిండ్ల వంపులో ఊరు దిగజారిపోయింది. తెల్లారేదాకా కాడులా కాలిందాగూడెం, గూడెంతోపాటు కొంతఊరు.

అప్పటికిగాని రమణయ్య నిషా దిగలేదు. రామానుజులి ఖుషీ పెరగలేదు. ఎవరు ఏమైపోతేనేం తనకు కాకపోయాక అనుకున్నాడు రామానుజులు. తనకోసం పాటుపడ్డ వాళ్ళకు ముడుపులు కట్టిన రామానుజులు. కూలీలకు కూడులేకపోతే పోయింది, కనీసం సానుభూతిగానైనా వచ్చి ఆదుకున్న ఒక్క మోతుబరిలేడు. ఒకళ్ళిద్దరు కొద్దిగా ధాన్యం యిచ్చినా అది ఏ మూలకు సరిపోతుంది? ప్రక్క ఊళ్ళవాళ్ళు ఒకటి రెండు రోజులు ఆదుకున్నారు. కాని అక్కడకూడా కాస్త పలుకుబడి కలిగినవాడికే సహాయం దక్కింది. యింగితజ్ఞానం తెలిసి, న్యాయానికి కట్టుబడే ధర్మరాజు అతని స్నేహితులను కూడ గట్టుకొనివచ్చి, వచ్చిన సహాయాన్ని అందరకూ సమానంగా పంచడానికి ప్రయత్నం చేసినా ఊరిపెద్దలు బోడిపెత్తనంమధ్య నీకెందుకని ఆ ప్రయత్నాలు సాగనీయలేదు.

గవర్నమెంటువారు పంపిన డబ్బుకూడా రికార్డులో పంచినట్లు బాగానేవుంది. కాని అది (డబ్బు) నిరక్షరాస్యులు, నోరుతెరచి అడగలేని బీదాబిక్కికి న్యాయంగా అందలేదు. తెలియకుండా డబ్బుఅంతా ఐపోయింది. ఎదిరించి అడిగినవాళ్ళకు చివాట్లు మాత్రమే లభించాయి. మరికొంతమందికి వీపులు వాచిపోయాయి. కానీ ఏంచేయగలరు వాళ్ళు? డబ్బుతో సంఘాన్ని ఆకట్టుకొన్న పెద్ద మనుష్యులను ఎదిరించలేకపోయారు

''నయాళ్ళు నాకు ఓటు వేయండి అంటేఏదో పాపం చేయవలసివచ్చినట్లు భయపడ్డారు.వాళ్ళకు తగినశాస్తి జరిగింది. గంగులూ! ఇలాగే వాళ్ళనుముప్పతిప్పలు పెడుతూ మూడుచెరువుల నీళ్ళుతాగిస్తూండు'' అంటూ రామానుజులుపెద్దగా నవ్వుతూ లోనికి పరుగెత్తాడు. గంగులు, వెర్రిలోపడ్డ రామానుజులివెంట లోపలికి నడిచాడు.

ఊరెందుకు కాలింది? మొదట్లో విచారణ చేస్తే సరయిన సమాధానం ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఆ తర్వాత ఆ ఊసెత్తినవాడు లేడు. అదేదో అగ్నిప్రమాదంజరిగినట్లు, సామాన్యమైన విషయం జరిగనట్లు అధికారులు రికార్డు వ్రాసుకోవడం తప్ప మరేమీ జరగలేదు. మనిషికే సరయిన న్యాయం జరగనప్పుడు పశువుల సంగతి యింకేంచెప్పాలి?

దాదాపు 5 రోజులవరకు గుడారాలు వేసుకొని ఎండిపోయిన చెరువులో గడిపిన కుటుంబాలు పడ్డ బాధలకు లెక్కలేదు. కాస్త అభిమానం వున్న బీద కుటుంబీకులకు ప్రాణ సంకటమైన స్థితి. నోరుతెరచి అడుగలేరు. అడగకపోతే ఆకలి దాడిచేస్తుంది. ఆకలికి, అభిమానానికి పొత్తుకుదరదు అంటూ తెలిసి కూడా బాధ అనుభవించడం నీతి.

కొన్ని సంసారాలు చితికిపోయాయి. జీవితంలో మలుపులు తిరిగే సమయమైంది కొందరికి ఉద్రేకం ఏమైనా చేయిస్తుంది ధనంలాగ. ఉత్త పిరికివాడు కూడ మహా వీరుడిగా మారిపోతాడు. పాపం చేయనివాడు పాపిగా, పాపి పుణ్యాత్ముడుగా మారి పోవడానికి కొన్ని క్షణాలు చాలు. అయితే సంఘటన బలీయం అవ్వాలి.

గంగులు-రామానుజులి ఉప్పు, పులుసు తిన్నానని నమ్మిన గంగులు, రమణయ్యను చంపటానికి సిద్ధమయిన గంగులు, పుట్టినప్పట నుండి రౌడీతనం చేస్తూ రక్తపు కూడు తింటున్న గంగులు, తనతోటివారు పడ్డ బాధలు చూసి; ఒకప్పుడు తన ప్రాణాలను కాపాడిన రాముని దీనస్థితిని-ఏకాకి ఐన ఎల్. డి. సి. రాముని పరిస్థితిని చూసి; సమస్తం

అగ్నిహోత్రుని పాలుకాలుగా జీవితాలు కుంగిపోయిన మధ్యతరగతి కుటుంబీకుల దీనావస్థను చూసి చలించాడు. మనిషి చలించి, మనసుక్షోభ పెట్టగా రామానుజులి వద్దకు పరుగెత్తుకువచ్చాడు. రామానుజులు అన్నమాటలనువింటూ అతనివెంట యింటిలోనికి నడిచాడు.

''దొరా! డబ్బుకావాలి!'' అన్నాడు గంగులు.

"పిచ్చి గంగులూ! నీడబ్బు ఎక్కడికి పోతుంది. భద్రంగా దాస్తాను! నీకు అవసరమైన సమయం చూసిస్తాను. యిప్పుడిస్తే ఏ త్రాగుడికో పెడతావ్! అలా చూస్తావేం గంగులూ? నీకన్న నాకు ఎక్కువ ఎవరు? నా ప్రాణానికి సమానమైన వాడివి. వెర్రి వాడిలా అలా చూస్తావేరా" అంటూ రామానుజులు బుజ్జగించాడు గంగులుని.

విశ్వాసంగల గంగులు, ప్రతిదానికీ మొహమాటం పడేటటువంటి గంగులు రామానుజులి మాటలకు లొంగిపోయాడు. ఒక్క క్షణం అదేక్షణం ఎండిపోయిన చెఱువులో వున్న కుటుంబాల దృశ్యం లీలగా మెదిలింది మనసులో, అదే క్షణంలో రామానుజులు గంగులి మనసును నీసామీదికి మరలించాడు. అలవాటుచొప్పున గంగులు దానికి లొంగిపోయాడు. మళ్ళీ ఒకసారి గంగులి వ్యక్తిత్వం చచ్చిపోయింది. ఆలోచన-అతని తలలోని ఆలోచన అతనినుండి ఆమడల దూరంగా తరుమబడింది. గంగులి జీవితంలో మెరసే మెఱపుమరలిపోయింది. రామానుజులిధాటికి తట్టుకోలేక పారిపోయింది. మళ్లీ మామూలే ఆ గంగులూ, ఆ వర్తనా...

ప్రెసిడెంటు రమణయ్య, ప్రజలకోసం పాడుపడతానన్న రమణయ్య, ఓట్లకోసం నోట్లను వెదజల్లిన రమణయ్య, ప్రజలకు కలిగిన దురదృష్టానికి గుడ్డచాటున కండ్లనీరు పెట్టుకొని సహాయం చేస్తానని హామీ యిచ్చాడు. విరాళాలద్వారా వచ్చిన డబ్బులో తోచినంత కాకికి ఎంగిలిచేయి విసరినట్లు, తన సొమ్మే యిస్తున్నట్లు విదల్చాడు. మిగిలింది ఆయనగారి ముఖ్య సహచరులకు ; సహ ధర్మచారిణి గారికి అర్పితమయింది.

అవును మరి-ప్రజల మనిషి తాను. ప్రజలకోసమని దర్జాగా ఉండాలి మరి. ఆ దర్జాలో పెద్దవాళ్ళ అనుగ్రహం సంపాదించి బీదలకు సహాయం చేయాలి.

''మనమీద దేవునికి కోపం వచ్చింది కాబోలు. ముక్కుసూటిగా పోయేవారికి ఎదురాళ్లు ఎక్కువన్నట్లుగా న్యాయంగా నడిచే నాకు అడుగడుగునా కష్టాలే వస్తున్నాయి. లేకపోతే నా సోదరులలాంటి మీకు యింత కష్టం రావడం ఏంటి? నాచేతనైనంత సహాయం చేస్తాను. చేస్తూనేవున్నాను, యికముందు కూడా చేస్తాను. మీ అందరికీ మేలు చేకూరడానికి పై అధికారుల వద్ద ప్రయత్నిస్తాను. మరి నేనుంటాను''అని రెండు చేతులెత్తి గోవిందకొట్టిన రమణయ్యను చూసి బయటకొచ్చారు అగ్ని బాధితులు నిరాశగా.

* * * *

మాటయిచ్చి సంవత్సరం గడిచినా మళ్ళా పైసా రాలేదు వాళ్ళకు. రమణయ్య ఎప్పుడు జీపుల్లో తిరగడమే. రామానుజులకి రమణయ్య పనులకుఆటంకం కల్గించడం ఆ ఆటంకాలను తొలగించుకునేందుకు రమణయ్య బాధలు పడటం ఇవే జరిగాయి. ఏదో ఒక వంకమీద ఇరువర్గాల వారికీ పక్షానికొకసారి కక్షలమీద కలహాలు జరిగేవి. ఆ కొట్లాటలలో

ఎవరో ఒకరు చావడం మరికొందరికి గాయాలు తగలడం పరిపాటి అయింది. గంగులు ఒకవైపు లీడరు. ఊళ్ళో కూలీలు గతిలేక కొట్లాటల్లోకి వచ్చిడబ్బు సంపాదించుకోవడానికి బోలెడు మందితయారయ్యారు.ఒక్కొక్కప్పుడు ఆ కూలికూడా వాయిదాలమీద లభించేది. కాలే కడుపును చల్లబరచుకోవడానికి వాళ్ల దానికి సిద్ధమయ్యారు.

అక్కడి శ్రామికుల్లో కాస్తచదువుకొని వ్యవహార దక్షత కలవాడు రాముడొక్కడే. అతనికి కుడి, ఎడమ భుజాలు రంగడు, ధర్మరాజు. ఊళ్ళో జరిగే అవకతవకను, బీద వాళ్ళకు శ్రమకుతగ్గ ఫలితానికి అసలయిన హక్కుదారులైన శ్రామికులకు జరిగే అన్యాయాలను పై అధికారులకు, సమణయ్యకు వివరించి చెప్పాడు రాముడు. 'చూద్దాంలే' అన్న సమాధానం తప్ప రాముడి ప్రయత్నాలకు మరేమీ రాలేదు. కమిటీ సమావేశాలలో బడ్జెట్టులో వచ్చే లాభాలమీద చర్చలు తప్ప మరేమీ జరగడం ఆ ప్రజలు వినలేదు.

తమ ఫ్యాక్టరీలో క్రొత్తగా ప్రవేశించిన రామచంద్రం ఆదాయ, వ్యయపు లెక్కలు తను చెప్పినట్లుగా వ్రాయలేదని సుందరయ్య శెట్టి అతనిని నిలదీసి అడిగాడు—

"నీ తాతగాడి సొమ్మేమయినా యిక్కడ పాతిపెట్టావా ఏమిటి యిన్‌కంటాక్సు తేరగా కట్టడానికి? నేను చెప్పినట్లు లెక్కలు వెయ్యి. నీ తలతిరుగుడు సమాధానాలు, లెక్కలు నాదగ్గిర పనికిరావు."

"శెట్టిగారూ! మీ ఉద్యోగం లేకపోతే ఫర్వాలేదు. నేను తప్పుడు లెక్కలు వ్రాయను. వ్రాయలేను. మీ ఉద్యోగం చేస్తూ జీతం తీసికొంటున్నది నేను చేస్తున్న పనికి విలువ మాత్రమే. దొంగలెక్కలు వ్రాయడానికి కాదు. మీ బానిసకింద జమకట్టబడే పద్ధతిలో ప్రవర్తించలేను" అన్నాడు రామచంద్రం,

సుందరయ్య శెట్టి రామచంద్రంను పనిలోంచి తీసేశాడు. రామచంద్రానికిది తీవ్ర శరాఘాతమైంది. అతని సంపాదన మీద ఆధారపడి ఉన్నది అతను ఒక్కడు మాత్రమే కాదు, అతనితల్లి, చదువుకునే యిద్దరు తమ్ముళ్లు, పెళ్లి కావలసిన ఒకచెల్లెలు మొత్తం తనతోబాటు 5 గురు రెండు పూట్లా చాలినంత భోజనం చేయలేకపోయినా కనీసం కలో గంజో కావాలిగదా. రాముడు ఇది తెలిసి రామచంద్రాన్ని కలుసుకొని భయపడవద్దనీ, తామంతా అండగా నిలుస్తామనీ ధైర్యం చెప్పాడు.

రామచంద్రాన్ని ఉద్యోగం నుండి తీసివేయడానికి వీలులేదని మరల అతనిని తిరిగి పనిలోనికి చేర్చుకోవాలని రాముడు సుందరయ్య శెట్టిని అర్థించాడు.

రామచంద్రం తనమాటప్రకారం ప్రవర్తించలేదని తనదగ్గరేకాక మరే ఇతర ఫాక్టరీలో గూడా అతనికవకాశం లేకుండా చేశానని సుందరయ్యశెట్టి కోపంగా చెప్పాడు

"సుందరయ్యగారూ! మీరు ఎవరి కండబలంమీద యింత డబ్బును సంపాదించారో గుర్తు తెచ్చుకోండి! అర్థాంతరంగా ఏదో సాకుమీద ఒక ఉద్యోగిని తొలగించి వేయడమే కాక అతనికెక్కడా ఆధారం లేకుండా చేయడం భావ్యమైన విషయంకాదు మళ్ళీ ఓసారి ఆలోచించుకోండి" అన్నాడు శ్రామికనాయకుడు రాముడు.

"రాముడూ! నీకెందుకు లేనిపోని గొడవ నీపని నువ్వు చూసుకుంటూపో. అనవస

రంగా రామచంద్రం విషయంలో జోక్యం కలిగించుకోవద్దు. మీకు నాతో విరోధం వద్దు నేనేమీ బెదరింపులకు లొంగను-'' శెట్టి అన్నాడు.

కాని మళ్ళీ రాముడు ప్రయోగించిన అస్త్రంద్వారా సుందరయ్యశెట్టి రామచంద్రాన్ని పనిలోకి తీసుకొన్నాడు. అప్పటినుండి సామాన్యుడికీ, షావుకారుకీ మధ్య విభేదాలు మరింత పెరిగాయి.

ఏ ఆరు, ఏడు వందలకో గడ్డితిన్న నాటువైద్యుడు గోవిందయ్య బుద్ధి ఫలితంగా రామచంద్రం శరీరం పచ్చగిలింది. రామచంద్రం కుటుంబం నడుం విరిగింది. రాముడికి కార్మికులకి ఈ సంగతి రామచంద్రం శవం దహనమైన తరువాతగాని తెలియలేదు. డబ్బునెంటులో ఈ అన్యాయపు కంపును మూసివేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

ఇన్ని జరిగాక, ఇన్ని ఎదురు దెబ్బలు తగిలాక పాపం అప్పుడుకాని కార్మికులకు కనువిప్పుకాలేదు మరి! రంగాపురంలోని ప్రతి సామాన్యుడు అన్యాయాన్ని గ్రహించాడు. నిరంతరం తనకు జరుగుతున్నదదేయనే నగ్నసత్యం గ్రహించాడు. కార్మికులు ప్రచండులయ్యారు. అన్యాయాలను అరికట్టాలి. కష్టాలకు తగిన ఫలితాలు కావాలి ఏంచేద్దాం! మన హక్కులు ఏరీతిగా దక్కించుకుందాం? ఏం తీర్మానాలు చేద్దాం? ఏది ఆచరణలో పెట్టి చూపుదాం. ఇన్ని తర్కాల మధ్య అందుకే అంతా సమావేశమయ్యారు.

* * * *

"ధర్మరాజూ! నీవు అన్నమాటలలో చాలావరకు నిజంవుంది. సమ్మెల్లోకూడా వ్యక్తిగత స్వార్థాలు చూసుకొంటున్నారు, కొంతమంది. ఇప్పుడు మారవలసింది మనం ప్రతి అన్యాయానికీ మనం తలవంచితే అలాగని తలమీద బరువు ఎక్కువవుతుందే కానీ తరగదు. 'మెత్తగా ఉంటే మొత్తబుద్ధవుతుంది' అన్న సత్యం ఈనాటిదికాదు అత్యాచారాలకు, అన్యాయాలకూ అడ్డుగోడల్లా మనలోని ప్రతి పౌరుడూ ముందుకురావాలి. అంతకన్న మనం చేయవలసిందేమీలేదు. రామచంద్రం కుటుంబానికి న్యాయం చేకూర్చేదాకా, అలాంటి భగ్నజీవులకు న్యాయం జరిగేదాకా మనం నిద్రపోవద్దు! లెండి!! పదండి సుందరయ్యశెట్టి, రమణయ్య, రామానుజుల్లాంటి స్వార్థపూరిత చీడపురుగుల్ని ఏరిపారవేయడానికి ముందడుగువేయండి! మనకు కావాల్సింది న్యాయం!

అందరికీ కూడూ, గుడ్డా ఇవ్వగలిగి మన గోడులనాలకించేటటువంటి న్యాయం కావాలి. ఈ సమస్యకు పరిష్కారం ఆలోచించడంకాదు, చెప్పడం అంతకన్నాకాదు మనకు కావాల్సింది చేతలు. మంచిగా మనిషిలో మార్పుతెద్దాం! అవసరమైతే దేనికయినా సిద్ధపడదాం! పదండి!!!''— అంటూ రాముడు బయలుదేరాడు. అతన్ని అనుసరించి బయలుదేరింది మిగతా ప్రజానీకం న్యాయాన్వేషణకు.

(రచనకాలం: 1969)

# దీపం - పురుగులు

సుధామ

"వాడుట్టి బ్రూట్! కళ్ళముందు జరుగుతున్నదానిని కూడా గ్రహించలేక కళ్ళు తెరుచుకుని వుండి మూసుకున్నవాడిలా ప్రవర్తిస్తున్నాడు. చెపితే అర్థం చేసుకోడేం!"- ఇది సూర్యనారాయణ విషయంలో ఆ సాయంత్రం మరోసారి నేననుకున్నమాట. అలా అనుకోవడం తరువాయి వాడిని వెంటబెట్టుకొని బీచివైపు బయలుదేరాను. అలలు కమ్మని సంగీతాన్ని పాడుతున్నాయి. నీటి కాకులు వాటిచుట్టూ తిరుగుతున్నాయి. పడవలు అన్నీ ఒడ్డుకు చేరుకొంటున్నాయి. ఒకటీ అరా దూరంగా కాగితం పడవలంత చిన్నవిగా కనిపిస్తున్నాయి. జనం ఎక్కువగాలేని ఓ మూల రుమాళ్ళు పరుచుకొని ఇద్దరం కూర్చున్నాం! కొంచెంసేపటిదాకా మా యిద్దరిమధ్యా మాటల్లేవు. నిశ్శబ్దం ఛేదిస్తూ నేనే అన్నాను.

"నువ్వు గుడ్డివాడివి" ఈమాట అన్నాక వాడికి చాలాకోపం వస్తుందని నేను ఊహించాను కానీ వాడు నవ్వి వూరుకొన్నాడు. కనీసం 'ఏం...?' అనికూడా అనలేదు.

'నువ్వు జ్యోత్స్నను ప్రేమిస్తున్నావ్!"

"లేదు నేను ప్రేమించడంలేదు."

"కానీ ఆమె నిన్ను ప్రేమిస్తోంది."

"అది నా కనవసరం" ఈ మాట అన్నాక నాకు చాలా కోపం వచ్చింది.

"మరి నీకు కావలసిందేమిటి?" తీవ్రంగానే అడిగాను.

"ఆమె భవిష్యత్తు. ఆమెకాళ్ళమీద ఆమె నిలబడగలగాలి. ఆమెకు జీవితంమీద యింటరెస్టు కలగాలి ఆమె-బాధలు, భయాలు అన్నిటికీ అతీతురాలిగా ఆనందంగా జీవించాలి. ఆమె అనుభవించిందేమిటో నీకు తెలుసు"

అవును, ఆ సంగతి నాకు బాగా తెలును. నిజంగా తను ఈ ఇరవైయేళ్ళ జీవితంలోనూ అనుభవించినది బాధలూ, రోగాలూ ఇవే! వాళ్ళ నాన్నగారు రిటైర్ కావడంతో ఉద్యోగంలేని అన్నమీద కుటుంబభారం పడింది. అతనికున్న భుజశక్తి దాన్ని మోయలేకపోయింది. అశక్తుడై పరారీ ఐపోయాడు. అక్క పెళ్ళిపీటలమీద పేచీలు రావడంతో పెళ్ళాగిపోయి బావిలో జీవితం ఐక్యం చేసుకొంది. ఈ సంఘటనలతో తల్లి మంచంఎక్కి మూడు నెలలు తిరక్కుండా పెద్ద కూతుర్ని చేరుకొంది. తండ్రికి క్షయ. జ్యోత్స్న తండ్రిని ఈ మద్రాసులోని క్షయ వైద్యశాలలో చేర్పించింది. అలాంటి పరిస్థితులలో సూర్యనారాయణ తారసపడ్డాడు. ఇద్దరూ చిన్నప్పటి క్లాస్‌మేట్స్. నారాయణ యిప్పుడు

మంచి హోదాలో వున్నాడు. అందుకే జ్యోత్స్న జీవితాన్ని బాగుచేయాలనుకున్నాడు ప్రైవేటుగా మెట్రిక్ కట్టిస్తున్నాడు. టైపు, షార్టుహేండు నేర్పిస్తున్నాడు. రోజూ సాయంత్రం ఫాక్టరీ పనిఅవగానే జ్యోత్స్న యింటికెడతాడు. రాత్రి ఎనిమిది గంటలదాకా పాఠాలు చెపుతాడు. ప్రొద్దున్నే టైపుకి, షార్టుహేండ్‌కి పంపిస్తాడు. జ్యోత్స్న నారాయణని ప్రేమిస్తోంది. ఇది గ్రహించలేకపోతున్నాడు వాడు. చెప్తే అది నాకు అనవసరం. అంటాడు. వాడి కళ్ళల్లోకి లోతుగా చూశాను వాడిలో ఏదో మథన, సంఘర్షణ రేగుతోందనిపించింది. అవును, 'దేవకిని ప్రేమించాడు. తన ప్రేమను ఆమె ముందు వ్యక్తపరిచాడు. కానీ ఆమె తిరస్కరించింది. ఇప్పుడా దేవకి వేరెవర్నో పెళ్ళిచేసుకొని హైద్రాబాద్ వెళ్ళిపోయింది. ఓ బాబు కూడా పుట్టాడు. ఆమె వీడిని ఎప్పుడో మరిచిపోయింది. కాని ఆమెను వీడు మరచిపోలేకపోతున్నాడు. భగ్న ప్రేమికుడు. కాని జ్యోత్స్న వీడిని గాఢంగా ప్రేమిస్తొంది. అది నాకు తెలుసు.

"ఆమె భవిష్యత్తులో ఏమవుతుంది ?" అడిగాను వాడిని.

"తనకాళ్ళమీద తాను నిలబడగల్గి జీవిస్తుంది."

"అదొక్కటేనా ఆమె కోరుకుంటున్నది"

"మరి"

"లేదు నారాయణా! ఆమెకు జీవితంమీద యింట్రెస్టు కలిగించేవి నువ్వు కట్టిస్తున్న పరీక్షలు కావురా! ఆమెకు కావల్సింది తనను ప్రేమించగల వ్యక్తి, లాలించే మనిషి. తను అన్ని రోగాలూ, రొష్ఠులూ, బాధలూ అనుభవించింది ఇంతదాకా. ఆమె ఆడది, అందులోనూ వయస్సులో ఉన్న ఆడది. ఆమె-తనను ప్రేమించే హృదయం ఒకటున్నదని తెలిస్తే జీవితంమీద ఆసక్తిని, తీపిని పెంచుకుంటుంది. అప్పుడీ పరీక్షలు ప్యాసు కావడం ఆమెకు చిటికెలమీద పని."

వాడేం మాటాడలేదు. చేతులు రెండూ వెనక్కి యిసుకలోపెట్టి కాళ్ళు జాపుకొని సముద్రానికి అవతలిగట్టును చూస్తున్నాడు సన్నని గీతలు కనబడుతున్న ఆ తీరందాకా గలగలా పారుతున్న నీళ్ళను, రేగుతున్న అలలను పరిశీలిస్తున్నాడు. వాడి కళ్ళల్లో ఎరుపుదనం కనిపించింది నాకు. నాకు భయంవేసింది. వీడు దేవకిని ప్రేమించాడు, నిజంగా చాలా ఘాటుగా ప్రేమించాడు. తన జీవితం, తన కలలు అన్నీ ఆమెతోనే అనుకున్నాడు. ఆమెను ఊహల్లో నిలుపుకుని సుందరస్వప్నాలుకంటూ సౌధాలు నిర్మించుకున్నాడు. కానీ దేవకి వాటిని పవన భవనాలుగా కూల్చివేసింది. మనసు విరిచేసింది. దాంతో వీడికిగాని స్త్రీజాతిమీద కక్ష ఏర్పడిందేమో! తను ఒక స్త్రీ చేత వంచిపబడ్డాడు. దానికి ప్రతీకారం స్త్రీ జాతిమీద తీర్చుకుందామనుకుంటున్నాడా! ఏమో! జ్యోత్స్నలో ఆశలు, ప్రేమలు చిగురింపజేసి తను ప్రేమిస్తూన్నట్లు నటిస్తూ ప్రవర్తించి ఆమెను ఒక్కసారిగా తిరస్కరిస్తాడేమో! అలాగయితే వీడి జీవితం నాశనమవుతుంది. ఎందరో స్త్రీల జీవితాలు నాశనమవుతాయి. కానీ జ్యోత్స్నని వీడు ప్రేమించాలి. అప్పుడు గాని ఆమె జీవితం బాగుపడదు. "ఆ జీవితంమీద రక్తి ఆసక్తిని పెంపొందించి, బ్రతుకుమీద తీపి

పెంచి, ఆమెకు చక్కని ఆధారం కల్పించి, సుఖమయ భవిష్యత్తును తీర్చిదిద్దడమే చిన్ననాటి స్నేహితుడిగా జ్యోత్స్నకు నేను చేయగలిగింది'' అన్న సూర్యనారాయణ ఆశయం అప్పుడే నెరవేరేది. ఎంత చెప్పినా అర్థం చేసుకోడేం!

''నీకు వరూధిని ప్రవరాఖ్యుల కథ తెలుసా'' మళ్ళా నేను మొదలుపెట్టాను.

''వరూధిని ప్రవరాఖ్యుడిని గాఢంగా ప్రేమించింది. కానీ అతడు తిరస్కరించాడు. ఆఖరికి ఒక గంధర్వుడు ఆవేశంలో ఆమెని మోసం చేశాడు. ఆమెను అనుభవించాడు. ఈ ద్రోహం గంధర్వుడిదంటావా. కాదు ప్రవరాఖ్యుడిది. అతనే గనుక అంగీకరించి వుంటే వరూధిని మోసగింపబడి వుండేది కాదు కాబట్టి ఓ అభినవ ప్రవరాఖ్యా! జ్యోత్స్నను పెళ్ళి చేసుకో! లేకపోతే ఆమెకూ ఏ గంధర్వుడో తారసపడతాడు. ఆమెను తనవైపు త్రిప్పుకొని మోసం చేస్తాడు.''

''ఆమెను మోసం చెయ్యడానికి ఇక్కడ ఏ గంధర్వుడూ రెడీగా లేడు లేవోయ్!''

'లేకపోతే వస్తాడు!''

''ఆమెను ఎవ్వడూ మోసం చెయ్యడు. ఎవ్వడూ రాడు.''

''ఎవడిదాకానో ఎందుకు నేనే వున్నాను.''

''నువ్వా!'' వాడు గట్టిగా నవ్వాడు

''ఏం?''

''నువ్వు ఆమెను మోసం చెయ్యవు! నా రావ్ ఎలాంటివాడో నాకు తెలుసు నీ కలాంటి పాపచింతన ఎప్పుడూ కలుగదు. నీలో నైర్మల్యం తప్ప కల్మషంలేదు.''

''అనుకుంటున్నావురా! కానీ నీకు తెలీదు. నేను చాలా దుర్మార్గుడిని. నాకు పాపాలుచెయ్యడం భలే యిష్టం. చిన్నప్పుడు కావాలని బోల్డుచీమల్ని, కాలరాచి చంపాను. బ్లేడు పుచ్చుకొని ఎవ్వరూ చూడకుండా మా పక్కింటి వాళ్ళ ఆవుచర్మాన్ని నిలువుగా కోశాను.''

''ఉహుఁ! నువ్వు మోసగించలేవ్! నీ తరంకాదు. నీలో అలాంటి భావనలు లేందే! వున్నా జ్యోత్స్న చాలా తెలివిగలది. ఆమె మోసపోదు.''

''బలహీనక్షణాలు బ్రదర్. ఆ క్షణాల్లో ఎలాంటి ఆడదయినా సులభంగా మోసపోతుంది.''

''నువ్వు చెయ్యలేవ్! ఆమె పోదు'' ఈమాట అనేసరికి నాకు పంతం పెరిగింది ''నిజంగా ఆమెను మోసంచేసి తీరుతా'' అన్నాను.

''ఉహుఁ! చేయలేవు''

''సరే! చూడు ఆమెను మోసం చెయ్యకపోతే నా పేరు రావు కాదు. ఆమెను యిప్పట్నుంచీ నేను ప్రేమిస్తాను. కాదు కవ్విస్తాను.'

''ఐవిల్ సీ!''

''ఐవిల్ సీ!'' గట్టిగా అరిచాను.

''ఇప్పట్నుంచీ మనం బద్ధ విరోధులం నేను జ్యోత్స్నను మోసంచేసి చూపిస్తాను.

చూస్తాను." దృఢంగానూ, ఆవేశంగానూ అరిచాను.

"విరోధం ఎందుకు. లెటజ్ సీ" అన్నాడు.

వెంటనే లేచి వచ్చేశాను. వాడు ఎంతదాకా అక్కడ కూచున్నాడో కూడా నాకు తెలీదు.

* * * *

జ్యోత్స్న కాటుక కళ్ళల్లోకి చూస్తోన్నప్పుడు, ఆకళ్ళు నవ్వుతూ కనిపిస్తోన్నప్పుడు నా పంతం గుర్తుకు వచ్చేది. 'ఐవిల్ సీ' అన్నమాటలు గుర్తుకు వచ్చేవి. ఆమాట అనడంలో నాఉద్దేశంఏమిటంటే..."జ్యోత్స్నను ప్రేమిస్తున్నట్లు నటిస్తూ సూర్యనారాయణలో అసూయ, ఉక్రోషం కలిగించేలా చేసి వాడు జ్యోత్స్న తన చేజారిపోతోందని గ్రహించి జాగ్రత్తపడే సమయం వచ్చాక వాళ్ళిద్దర్నీ కలిపి తొలగిపోదామ' ని కానీ—జ్యోత్స్నతో చనువు పెరిగాక ఆమెతో కలిసి తిరుగుతూ, ఆ నవ్వుతున్నట్లువుండే కళ్ళల్లోకి, ఎర్రని పెదిమలకేసి, సంపంగిలాంటి ముక్కుకేసి చూస్తూ వున్నప్పుడు, తీయని ఆమె కంఠస్వరం వింటూ, గడుపుతూ వున్నప్పుడు నన్ను నేనే మరచిపోసాగాను. అప్పుడు నా పంతం మరిచిపోయేవాడిని.

నేను కొన్నాళ్ళదాకా నటించి ఆ మీద హఠాత్తుగా నటించడం మానేశాను. నేను నిజంగా జ్యోత్స్నను ప్రేమించడం ప్రారంభించాను. దానికి కారణాలు ముఖ్యంగారెండు. ఒకటి—ఆమె అందం. అది నన్ను తన వలలో వేసుకొంది. రెండవది-జ్యోత్స్న నావైపు మొగ్గడం, నా యాక్షన్‌కు తన రియాక్షన్ అనుకూలంగా వుండటం.నేను కొంచెం చనువు ప్రదర్శిస్తే తను రెండు రెట్లు ప్రదర్శించడం, ఎప్పుడు నన్ను గూర్చే ఆలోచిస్తూ నా తలపుల్లో తీయగా అనుభవిస్తూ గడుపుతూండడం. ఇంతగా నాకు అనుకూలమయ్యాక నాలోని స్వార్థంపెరిగిపోయింది. జ్యోత్స్నను నా సొంతం చేసుకోవాలి. ఆమెలోని అణువణువూ నాలోకలిసిపోవాలి అన్న తపన నాలో విజృంభించింది. ఆమె యింక నాచెయ్యి జారిపోకూడదు. సూర్యనారాయణకి ద్రోహంచేస్తే చేశానుగాక!

ఈమధ్య సూర్యనారాయణలో నేను అనుకున్న మార్పు కనిపిస్తోంది. మాయిద్దరి చనువూ అతనికి ఉక్రోషమే కలిగిస్తోన్నట్లు అనిపించింది. అదిచూసి నేను అతన్ని తప్పించుకొని తిరగసాగాను. కావాలని అతని ఎదురుగుండా జ్యోత్స్నతో షికార్లు, సినిమాలు, చనువు పెంచసాగాను. జ్యోత్స్న అతనికి చిక్కకూడదనీ, నా చేజారిపోకూడదనీ నా ఆశయం. ఓ సాయంత్రం జ్యోత్స్నవాళ్ళింటికెళ్ళాను. తలుపులు దగ్గరగా వేసున్నాయి. లోపలనుంచి సూర్యనారాయణ కంఠం వినిపిస్తోంది.

"పాఠాలు చదవలేదేం అంటే రావ్‌తో సినిమాకెళ్ళాను, షార్టుహాండ్ ప్రాక్టీసు సరిగా చెయ్యవేం అంటే రావ్‌తో షికారుకెళ్ళాను ఏంమాటాడినా రావు; రావు; రావు; వాడు తప్ప నీకింకేం కనబడటంలేదా! ఎప్పుడు చూచినా వాడి నామస్మరణమేనా!" విసురుగా తలుపులు తెరుచుకుని బయటకు వచ్చాడు. నన్ను చూసి ధుమ ధుమ లాడుతూ వెళ్ళిపోయాడు.

ఇంక ఈ ముసుగులో గ్రుడ్డులాట లాభంలేదనుకొన్నాను. జ్యోత్స్న నన్ను ప్రేమిస్తోంది. అవును ఆమె నా స్వంతం. రేపే సూర్యనారాయణని, వేరే ఫ్రెండ్స్ని జ్యోత్స్న వాళ్ళింటికి పిలిచి మేమిద్దరం పెళ్ళిచేసుకోబోతున్నట్లు వెల్లడిస్తాను, అనుకుని మర్నాడు సాయంత్రము జ్యోత్స్న వాళ్ళింటికేసి బయలుదేరాను. సాయంత్రం ఐంది సన్నగా చీకటిపడుతోంది. వాళ్ళింటి కెళ్ళాను. జ్యోత్స్న కూచుని మల్లెపూలు గుచ్చుతోంది. తలంటు పోసుకుంది. ఆవేళ శనివారం అని తెలిసింది. జారుగా ముడివేసుకొని జడ చివర వదులుగా వేసింది. ఫాలభాగంమీద తిలకం, లేయెండపడి మెరుస్తోంది. కాటుక కళ్ళని అరమోడ్పుగా మోసుకొని ఎర్రని పెదాలమీదుగా సన్నని కూనిరాగం వదులుతూ గులాబీ చీరలో మరింత అందంగా మెరిసిపోతుంది.

కుర్చీలో కూర్చోమంటున్నా వెళ్ళి ప్రక్కనే కూర్చున్నాను. ఆమెగాలి నాకు మత్తుగా తగులుతోంది. గిన్నెలోని మల్లెపూలు ఒక్కొక్కటే తీసి నేనందించటం, ఆమె గ్రుచ్చటం 'అబ్బా' అంది. సూది వేలుకు గుచ్చుకొంది రక్తంవస్తోంది. చటుక్కున ఆ చెయ్యి పట్టుకొని వేలు నోట్లో పెట్టుకున్నాను. ఆమె రక్తం ఉప్పగా తగిలింది ఇలా ఆమెలోని రక్తాన్నంతా పీల్చేస్తే; ఛ, ఏమిటది? వెర్రి ఆలోచన! అలా రాక్షసులు చేస్తారు. లేకపోతే రాక్షసుల్ని కృష్ణుడిలాంటివాళ్ళు చేస్తారు. మాలగ్రుచ్చి లేచి అద్దంలో చూసుకుంటూ పెట్టుకోడానికి లేచింది. దీపం వెలిగించబోయింది. 'వద్దు!' ఈ వెలుగే చాలు' అన్నాను కళ్ళెత్తి చూస్తూ చిన్నగా నవ్వింది. ఆ నవ్వుతోన్నప్పుడు ఆమె బుగ్గలోని సిగ్గులు మైమరిపిస్తాయి. మాల జడలో పెట్టుకోబోయింది. 'వద్దు! అని నేను తీసుకొని ఆమె ఆశ్చర్యంగా చూస్తోంటే జడలో పాయలుతీసి పూలు పెట్టాను. ఆమె భుజాలమీద చేతులు వేసి జడలో పూలు వాసన చూస్తూ దగ్గరగా లాక్కున్నాను. ఆమె విదిలించుకొంది. సన్నని నడుంమీద చెయ్యివేసి దగ్గరగా లాక్కుంటూ ముద్దుపెట్టుకోబోయాను. విదుల్చుకొని కిటికీ దగ్గరగా పోయింది. కృష్ణపక్షం చంద్రుడు తొంగిచూస్తున్నాడు. ''అలా విదిలించుకొందేమిటి? అవును మరి పెళ్ళికాందే సరసంచేస్తే పెడర్థాలు తీయదూ! నేను వెధవను'' అనుకున్నాను. జ్యోత్స్న ఏడుస్తోంది వెక్కివెక్కి, కిటికీలోంచి బయటకు చూస్తూ.

'తప్పే జ్యోత్స్నా! క్షమించు. పెళ్ళికానిదే అలా చెయ్యడం పొరపాటే! రేపే ఫ్రెండ్స్ని పిలిచి ఈ విషయం, మనిద్దరం పెళ్ళి చేసుకోబోతున్నట్లుగా వెల్లడి చేద్దాం. మీ యింట్లో చిన్న పార్టీ ఏర్పాటు చేద్దాం!' అన్నాను.

'మనిద్దరికీ పెళ్ళా!'' అంది కళ్ళు పెద్దవిచేస్తూ ఆశ్చర్యంగా!

'నేను మిమ్మల్ని ప్రేమించడంలేదే!''

''జ్యోత్స్నా!''

''అవును మీరసలు ఎలా అనుకున్నారు? నేనీపెళ్ళికి అంగీకరిస్తానని.'

''మరి నాతో అంత యిదిగా...!''

''ఇది... యిదిగా అంటే?''

"అదే చనువుగా......దగ్గరగా ?"

"చనువుగా దగ్గరగా వున్నంత మాత్రాన ప్రేమిస్తున్నానని పెళ్ళి చేసుకుంటానని ఎలా అనుకుంటున్నారు! నన్ను క్షమించండి. నేను సూర్యనారాయణని ప్రేమించాను జీవితంలో పెళ్ళంటూ చేసుకుంటే ఆయన్నే చేసుకుంటాను. మీరంటే నాకు ఎలాంటి భావమూ లేదు.

"మరినాతో అలా......? నన్ను ప్రేమించటంలేదా ?"

"చనువుగా ఎందుకు ప్రవర్తించానంటారు, క్షమించండి. సూర్యనారయణ నా ప్రేమను గుర్తించలేదు. ఆయనను కవ్వించి ఆయనంతట ఆయన నన్ను స్వీకరించాలనీ, మీతో చనువుగా ప్రవర్తిస్తే అది నెరవేరుతుందని నటించాను. నేను మిమ్మల్ని ప్రేమించలేదు. నటించాను. అది ఆయనకి తెలిసి నన్ను తన స్వంతం చేసుకుంటారని, ఆయన్ని వంచించి నన్ను నేను మోసం, ద్రోహం చేసుకోలేను. నేను మిమ్మల్ని ప్రేమించలేదు. ఆయనకు ద్రోహం చెయ్యలేను" ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

'నన్ను క్షమించు' తలవంచుకొని బయటకు వచ్చాను. సూర్యనారాయణ ఎదురయ్యాడు, తల వొంచుకున్నాను; నేనోడిపోయినట్లు. లోపలికెళ్ళాడు. వెనక్కి తిరిగి చూశాను అతని భుజాల మీద తలపెట్టి జ్యోత్స్న ఏడుస్తోంది. అతను వూరడిస్తున్నాడు.

"నన్ను క్షమించు జ్యోత్స్న! చూడు......నేనొట్టిబ్రూట్‌ని. నిన్ను అర్థం చేసుకోలేక పోయాను. ఏదీ జ్యోత్స్న! ఇంక ఏడవకూడదు. నేను వచ్చాగా, నువ్వు......నవ్వాలి."

ఆ పైన నేను వినలేదు. తలొంచుకొని గబగబా రోడ్డుమీదకి వచ్చేశాను. వీధి దీపం చుట్టూ పురుగులు సున్నాలు చుడుతున్నాయి. దీపం నిశ్చలంగా వుంది. పురుగులు తిరుగుతున్నాయి.

# కాశీపతి కథ రాశాడు

అక్కిరాజు జనార్దనరావు

వారం రోజులుగా తెమలకుండా వున్న పనిని ఆ రాత్రికిరాత్రే తెముల్చుకోవడానికి బైఠాయించాడు కాశీపతి. అంటే, మర్నాడు ఉదయం జరుగనున్న ఒకానొక సాహితీ గోష్ఠిలో తాను చదువవలసిన కథను సృష్టించడానికి ఉద్యుక్తుడయ్యాడన్నమాట! ఇన్ని రోజులనుంచీ కొరుకుడు పడనిదాన్ని ఆ ఒక్కరాత్రిలో ఒక కొలిక్కి తేవడానికి కాశీపతి పట్టు పట్టాడంటే, ఆ పూట—

''నిరుపహతి స్థలంబు, రమ
ణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయిన
భోజన, ముయ్యెలమంచ, మొప్పుత
ప్పురయు.........''

...ఇన్నీ అమిరాయనికాదు. అసలివి కాశీపతికి అక్కరలేదు. కోరుకున్నా వచ్చేవీ కావు.

సదరు సాహితీ గోష్ఠి తాలూకు ఆహ్వానం వారంరోజుల క్రితం అందినప్పుడే యీసారి తాను తప్పనిసరిగా కథ చదివి తీరాలని తీర్మానించుకున్నాడు కాశీపతి. అప్పటి నుంచీ త్రికరణ శుద్ధిగా ఆ ప్రయత్నంలోనే వున్నాడు. ఇక్కడ ప్రయత్నమంటే అది ఊహామాత్రమైనదే కాని క్రియాత్మకమైనది కాదని గమనించడం అవసరం. సంకల్పం ఆలోచనా పరిధిని దాటి కార్యరంగంలోనికి ప్రవేశించలేక పోయినందుకు పూర్ కాశీపతిని నిందించ పనిలేదు. అతను నిమిత్త మాత్రుడు. ఎప్పటికప్పుడు చిత్తశుద్ధిగా ప్రయత్నం చేస్తూనే వున్నాడు. కాని విధి బలీయమైనదిగదా!

తాను కథలు గిలకడం ప్రారంభించిన అర్ధ పుష్కరానికి ఆ రంగంలోఅక్షరాభ్యాసం చేసిన రంగశాయి యిప్పుడు వర్ధమాన రచయితగా చలామణి అవుతున్నాడు. ఇంచుమించుగా తనతోపాటే ఆ అలవాటు చేసుకొన్న కోదండం యివాళ కథక ప్రముఖుడుగా ''కోట్'' అవుతున్నాడు. అటువంటిది తనపరిస్థితి గొంగళి చందం కావడం కాశీపతికి ఖేదం కలిగిస్తున్నది. రచయితగా తనకు గుర్తింపంటూ లభిస్తున్నదంటే అది పూర్తిగా ఇంగువ గుడ్డను పోలినదేనని ఎవ్వరో కిట్టనివాళ్లు కాదు సాక్షాత్తు కాశీపతే అంటాడు ప్రయివేటుగా అడిగితే. ఆకాలంలో, కాలేజీలో చదివే రోజుల్లో కాశీపతి ఏవేవో కా...కథలు అల్లాడు. పత్రికలకు పంపించాడు. రాసిన పాతిక, ముప్ఫయి కథల్లో

మూడు, మహా అయితే మూడున్నర పర్సెంటు అచ్చయ్యాయి. అదీ అప్రసిద్ధ పత్రికల్లోనే అచ్చుకావడం ప్రధానంఅని సరిపెట్టుకున్నాడు, అంతకంటే చేసేది లేక.

ఇంతకూ కాశీపతి అర్రాత్రికి రాత్రే ఎలాగైనా కథరాసి పడేయాల్సిన ఖర్మమే మొచ్చిందని మీరు అడుగవచ్చు. అదీ నిజమే. అతనూ కాదనడు. అసలు వచ్చిన చిక్కేమిటంటే కాశీపతి ఇటీవల పాల్గొన్న రచయితల సమావేశాలన్నింటిలోనూ కేవలం శ్రోతగానే ఉండి పోయాడు. సభ్యుల పరిచయ ఘట్టంలో ఆర్గనైజరు, "వీరు ఫలనా... కథలు గట్రా రాసేవారు," అంటూ తనను మాజీ రచయిత కింద జమకట్టడం ప్రారంభించాడు. ఆఫీసులో ప్యూను అచ్చాలును మంచి నీళ్ళిమ్మనమని అడిగినప్పుడు అతగాడు, "ఇదేం దయ్యోయ్! నువ్వుకూడా అఫ్సర్ లెక్క బర్తావ్ చేస్తున్నావ్" అని, తనను మంచినీళ్ళకంటే పలచన చేసినప్పుడు కాని, బజార్లో బేరం చిట్టినప్పుడు రైక్షకుడు "జావ్‌జీ! తుమ్ రిక్షావాలే క్యాకర్తే"అని కొట్టి పారేసినప్పుడుకానీ కలగని బాధ తనను "సాహిత్య బాధితుడు" అంటే, అదే "మాజీ రచయిత" అని సంబోధించడంవల్ల కలుగుతుంది కాశీపతికి. తన పేరుకు ఆ విశేషణం తోకలా తగలకుండా వుండడానికే యింత తిప్పలు పడుతున్నాడు.

ఆహ్వానం ఏడు రోజులుముందుగానే అందినప్పటికీ, ఏడవరోజు రాత్రివరకు కాగితంపై కలం [ఆఫీసులో హాఫెనవరు, వన్నవరు లేటు పర్మిషన్లు రాయడానికీ, ఇంట్లో ఇస్త్రీబట్టల జాబితాపై టిక్కులు వేయడానికీ, ఏదో పువ్వు పేరును పేర్కొంటూ జలంధర్ జ్యోతిష్కునికి రాయడానికి మినహా] పెట్టి ఎరుగడు.

ఇంకా ఆరు, ఏడు రోజులుండిగా అప్పుడే తొందరేమొచ్చింది, గట్టిగా తలచుకుంటే ఒకటి, రెండు రోజుల్లో లాగి పారెయ్యొచ్చుననుకొని మొదటి రెండు రోజులూ గడిపేశాడు మూడోనాడు చిన్న అవరోధం వచ్చిపడింది పనిమీద పట్నానికొచ్చి చుట్టరికం కలుపుకున్న ఒక కార్యార్థి వరుసగా రెండు షోలకూ, టిఫిను, డ్రింక్స్ వగైరా అన్ని ఖర్చులూ భరించి తీసుకెళ్ళాడు. రెండు ఫిల్ము షోలు, ప్లెస్ మిసిలీనియస్ ఖర్చులనూ, కథారచననూ త్రాసులో అటు ఇటు వేసి దండాన్ని లేవనెత్తినప్పుడు అది ఒక వైపున కాశీపతి మోచేతికి "ఫెడీలు"మని కొట్టుకుంది. రెండిట్లో ఏ తక్కెడ అంతగా తేలిపోయిందో, ఏక టాకీన రెండు పిక్చర్లు చూచి ఆనందించిన కాశీపతిని పనికట్టుకొని అడగాల్సిన పనిలేదు. ఇక నాలుగోనాడు కాశీపతికి కథ సంగతే పట్టలేదని చెప్పక్కర్లేదు. గతరాత్రి అర్ధరాత్రి దాటాన్ గెస్టుతో కలిసి ఇరానీ చాయ్, కేక్ పేస్ట్రీ వగైరా డిస్టింగ్విష్ట్ గెస్టుకు మళ్లే పుచ్చుకున్న కాశీపతి ఆరోజు ఆకాశవాణి ప్రాంతీయ భాషలో ప్రాంతీయవిశేషాలను వినిపిస్తున్న సమయంలోనే భోజనంపూర్తిచేసుకున్నాడు.ఆ తరువాత ప్రపంచ వార్తలు వచ్చేవేళకే అతని గురక పతాక స్థాయికి చేరుకున్నది. మరి అయిదవ నాటి సంగతి. ఆ వేళ రాత్రి కథారచన సాగదని కాశీపతికి పొద్దుటే తెలిసిపోయింది అవకాయ పెట్టడానికి కావల్సిన సరంజామా జాబితా యిచ్చి ఆపూట అవి తెచ్చితీరాలని తాకీదు చేసింది యింటావిడ. లేకపోతే అప్పటికే మూడు, నాలుగురోజుల క్రితం అమ్మగా

రింటినుంచి వచ్చివున్న కాయలు పచ్చిపులుసుకు కూడా పనికిరాకుండా పోతాయట! అదీ నిజమే. మళ్ళీ అన్ని కాయలు కొనాలంటే మాటలా! పదిహేను ఇరవై శుభ్రాలన్నా అవుతాయి. ఎందుకొచ్చిన దండగ ఆ సరంజామా ఏదో పెందలాడే తెచ్చి పడేస్తే రాత్రి తీరిగ్గా రాసుకోవచ్చుననుకున్నాడు కాశీపతి. కానీ సరంజామా తెచ్చి పడేసినప్పటికీ తీరిక మాత్రం చిక్కలేదు. మీదు మిక్కిలి స్పెషల్ ఆసైన్‌మెంటు కూడా. తరువాయి కార్యక్రమంలో సహధర్మ చారిణికి సహాయం చేయకుండా వుండలేక పోయాడు.

ఇక పెనాల్టిమేటు డే సంగతి. ఆనాడు ఏఅవాంతరమూ లేకుండానే సుముహూర్తం వచ్చింది. రుచికి కొత్త పచ్చడితో సుష్టుగా భోజనంచేసి కాగితం, కలం, పెన్సిలు యిత్యాది పరికరాలన్నీ సిద్ధం చేసుకున్నాడు. అంతా రెడీఅయాక పెన్ను క్యాప్‌ను తోకకు తొడిగి, ప్లాటును గురించి ఆలోచించడానికి పూర్వం నాందీచర్యగా ఫుల్‌స్కేపు కాగితంపై శ్రీకారం చుట్టబోయేసరికి ఠపీమని చీకట్లు కమ్ముకున్నాయి. విద్యుద్దేవత నిర్దాక్షిణ్యానికి కాశీపతికి దుఃఖం పొర్లివచ్చింది. అయినా నిద్రాదేవత వెంటనే కరుణించి బుజ్జగించింది.

ఇక ఆఖరిరోజు సంగతి, అంటే తిరిగి మొదటికొచ్చామన్నమాట. దేనికైనా కాశీపతికి ఫైనల్ డే క్రూషియల్ డే కావడం పరిపాటి. అతను తప్పిన పరీక్షల సంగతి చెప్పటంలేదుకాని, నెగ్గిన పరీక్షలన్నీకూడా ఆనాటి అతని పెర్ఫార్మెన్స్‌పై ఆధారపడినవే.

ఆవేళ ఆఫీసులో వన్నవరు పర్మిషను శాంక్షను చేయించుకొని ఆనవాయితీ ప్రకారం మూడున్నర కావస్తుండగా బయటపడ్డాడు. పెందలాడే ఇంటికిరావడానికిగల ఏకైక కారణాన్ని ఇంటావిడకు నివేదించి ప్రొద్దుండగానే సాపాటు ముగించుకొని భుక్తాయసపు విశ్రాంతికికూడా స్వస్తి చెప్పి టేబిలువద్దకు చేరుకున్నాడు. సాధన సామగ్రిని క్రితంరోజే తెచ్చిపెట్టుకున్నాడు. కాబట్టి ఆ సమయంకూడా కలిసి వచ్చింది.

ప్యాకెట్టు విప్పి సిగరెట్టు ముట్టిస్తూ ప్లాటు ఆలోచనలో పడ్డాడు కాశీపతి. రెండో పుల్లఖర్చు కాకుండానే సిగరెట్లు ఖర్చయిపోతున్నాయి. ఆష్‌ట్రే నిట్టూర్పులకు లెక్కలేదు. రెండు పెట్టెలు డబ్ల్యు.పి. బాస్కెటును చేరుకున్నాయి. ఫ్లాస్కుకు మూడునాలుగు అరకప్పుల భారం తగ్గింది. కాని కథమాత్రం తనకు కాళ్ళులేని సంగతి ముమ్మాటికీ నిజమేనని నిరూపించుకున్నది.

గట్టిగా పూనుకుంటే ఒక్కరాత్రిలో కథరాసి పారేయగలనన్న ధీమాతోవున్న కాశీపతికి ఒక రాత్రంతా బుర్రబద్దలుకొట్టుకున్నా పట్టుమని పదివాక్యాలుకూడా రాయలేక పోయేసరికి తనమీద తనకే అసహ్యంవేసింది. మెదడు అలా మొద్దుబారినందుకు ఆందోళన కలిగింది.

పెద్దముల్లు వేగంలోనడుస్తున్నది చిన్నముల్లు. రేపు నేడయికూడా చాలాసేపయింది. అప్పటికి సుమారు ఆరుగంటల తరువాత ప్రారంభంకానున్న సమావేశంలో తాను చదువవలసిన కథను యింకా ప్రారంభించవలసే వుంది. ఆ సమయం చిత్రపతిని ఫెయిర్

చేయడానికికూడా సరిపోదు. అయినప్పుడు తాను కథరాయడం అసంభవం. అయినా తప్పదు. సమావేశంలో తాను కథ చదివితీరాలి.

ఆఖరు అరకప్పు కాఫీని చప్పరిస్తూ 'కింకర్తవ్యం' మీమాంసలో పడిపోయాడు కాశీపతి. ఖాళీకప్పను ప్రక్కనపెట్టి వ్రేళ్ళకు చురకలేసిన పీకతో మరో సిగ్రెట్ వెలిగించాడు. ఏమీ పాలుపోవడంలేదు. మరొకటి పీల్చేసి నాలుగోదాన్ని దమ్ములాగుతుండగా ఘాటైన ఆలోచన వచ్చింది కాశీపతికి. అందుకు తనను తాను అభినందించుకున్నాడు. బుర్ర మొద్దుబారిందని నిందించుకున్నందుకు నొచ్చుకున్నాడు. తరువాయి కార్యక్రమానికి ఉపక్రమించాడు.

అక్కడక్కడ వెతికి ట్రంకుపెట్టెలో అడుగున పడేసివున్న ఫైలును దుమ్ముదులిపి పైకితీశాడు. పావుతావు సైజు తెల్లకాగితంపై అంటించిన కత్తిరింపులను జాగ్రత్తగా పరిశీలించాడు. ఇటునుంచి అటు, అటునుంచి ఇటు నాలుగైదుసార్లయినా ఫైలు తిరగవేశాడు. గడియారం ముల్లు హెచ్చరించడంతో ఆలస్యం చేయకుండా ఒకచోట ఆగిపోయి అక్కడ ఫైలును మడిచిపెట్టి ముందు పెట్టుకున్నాడు.

పునఃసృష్టిచేస్తున్న కలం చకచకా సాగిపోయింది. పని తెమిలింది. ఒక కొలిక్కి వచ్చింది. ఫెయిర్ కాపీ రీడింగును తెల్లవారేసరికి వాయిదావేసి తృప్తిగా మంచంపైవాలాడు.

సాహితీ గోష్ఠిలో కాశీపతి కావాలని తనసీటు మార్చుకొని మూడవవానిగానో, నాలుగవవానిగానో ధీమాగా కథ చదివి వినిపించాడు. మామూలు ప్రకారం కొందరు సభ్యులు ఏవోకొన్ని సూచనలు చేశారు, మొత్తంమీద ఫరవాలేదన్నారంతా. అతనికి కావాల్సింది అదే. 'శైలిలో, వాతావరణంలో కొంత పాతవాసన కొడుతున్న'దంటూ ఒకరిద్దరుచేసిన వ్యాఖ్యలతో కాశీపతికి నిమిత్తంలేదు. దాదాపు దశాబ్దికితం ఆ కథవిన్న సదస్యుల వ్యాఖ్యలను నెమరువేసుకోడానికి అతను ప్రయత్నిస్తున్నాడు. అప్పటికీ, యిప్పటికీ అభిరుచుల్లో అంతరం ఎంతో తెలుసుకోవడానికి.

ఎలాగైతేనేం కథ చదివి 'రచయిత' బిరుదాన్ని 'రేన్యూవల్' చేసుకున్నందుకూ, 'మాజీ' విశేషణాన్ని మరికొంతకాలంవరకైనా ప్రక్కకు నెట్టగలిగినందుకూ ఆనందంగా వుంది కాశీపతికి.

# సంతృప్తి

రెడ్డి రాఘవయ్య

ఆరోజు పండుగ. నాగేశు ఆ పండుగకోసం ఎన్నో రోజులనుండి ఎదురుచూస్తున్నాడు. నాగేశంటే పల్లెలో పిల్లవాడు. అతడికి ఏడెనిమిదేళ్ళుంటాయి. వాళ్ళమ్మను 'అమ్మా! పండుగ ఎప్పుడు వస్తుందే!' అని ఆశగా అడగటం; ఆమె 'ఇంకా పదిహేను రోజులుందిరా!' అనో; 'పదిరోజులుందిరా!' అనో సమాధానం చెప్పటం మళ్ళీవాడు 'పది రోజులంటే ఎన్నాళ్ళకు వస్తుందే!' అడగటం, పది రాత్రులు గడవాలిరా! అని చెప్పటం; వాడు రోజూ రాత్రిళ్ళు నిద్రపోయి లేవగానే రోజులు తగ్గించి లెక్క వేసుకుంటూ ఎదురు చూసిన రోజు రానేవచ్చింది.

అతడి హృదయంలో ఎన్నో రోజులనుండి కోరుకుంటున్న మంచిరోజు రానే వచ్చిందని ఆనందం పరవళ్ళ త్రొక్కుతున్నది. ఆవరించుకున్న చీకట్లు సూర్యుని రాకతో మాయమై ఒక్కసారి వెలుగు వచ్చినట్లు వాడి ముఖం వింతకాంతితో మెరిసిపోతున్నది ఆ రోజు. వాడికంత ఆనందం ఎందుకంటే; పండుగరోజున కొత్త బట్టలు తొడుక్కోవచ్చు. అప్పచ్చులుతినొచ్చు. అదీగాక అసలు ముఖ్యంగా వాళ్ళఊరిగుళ్ళోని దేవుడూరేగుతాడు...

నాగేశు ఊరిలో పెద్దగుడి వుంది. దానిలో దేవుడున్నాడు. దేవుడంటే భక్తి నాగేశుకు. దేవుడిని గుడిలోకి వెళ్ళిచూడాలని వుంటుందిగాని వాళ్ళ పల్లెలో వాళ్ళని గుళ్ళోకెళ్ళనీయరట. ఊళ్ళోవాళ్ళయితే ఇంచక్కా, ఎప్పుడుపడితే అప్పుడెళ్ళి దేవుడిని చూస్తారు. తనకా అదృష్టం దేవుడూరేగేటప్పుడే కలుగుతుంది. దేవుడూరేగేరోజు చిన్న తిరుణాలలాగా వుంటుంది. రకరకాల మిఠాయి దుకాణాలు ఉంటాయి. పండ్లు అమ్ముతారు. దేవుణ్ణి రథంపైపెట్టి బాజాలు, భజంత్రీలు ఊదుతూ ఊరేగిస్తారు. రథానికి రంగురంగుల బట్టలు కట్టి కన్నుల పండువుగా అలంకరిస్తారు. అందుకే పండుగంటే వాడికంత ఆనందం

దేవుడి గుడి దగ్గరకు వెళ్ళటానికి నాగేశు తయారవుతున్నాడు. వాడు ఒంటరిగా గుడిదగ్గరికెళ్ళటం వాడి అమ్మకిష్టంలేదు. వాడిని పిల్లలు ఎగతాళిచేస్తారనీ, కొడతారనీ ఆమెకు అనుమానం. అందుకనే 'దేవుడూరేగుతూ ప్రక్కవీధిలోకి వచ్చినప్పుడు చూడొచ్చురా! బాబూ!' అని చెప్పింది. కాని వాడు వింటేనా? దేవుడూరంతా ఊరేగి వాళ్ళవీధిలోకి వచ్చేటప్పటికి చాలా ప్రొద్దుపోతుంది. అప్పటికివాడు నిద్రపోవచ్చు. అయినా ఊరేగింపు మొదలైనప్పుడున్న ఉత్సాహం చివరిదాకా ఎక్కడ వుంటుంది. బాజాలుమ్రోగించే వాళ్ళు అలసిపోయి, నిద్రమత్తులో సరిగ్గా మ్రోగించరు. అందుకనే వాడు గుడిదగ్గరికెళ్ళాలని పట్టుబట్టింది. వాడి ఆనందం చూచి అమ్మకూడా ఎక్కువగా మాట్లాడలేదు.

అమ్మ ఊళ్ళోవాళ్ళ దగ్గరనుంచి అడిగితెచ్చిన బుల్లిలాగు, బుల్లిచొక్కా తొడుక్కున్నాడు. అవి పాతవి; అవి మాత్రమే తనకున్నాయి. తనకుకూడా పొడుగులాగు, పొడుగుచొక్కా కావాలని ఎన్నోసార్లు అమ్మతో చెప్పాడు నాగేశు. కాని అవి ఇవ్వలేదట ఎప్పుడూ; కొనుక్కోవాలంటే వాళ్ళు బీదవాళ్ళు ఐతే; డబ్బులెక్కడనుంచి వస్తాయి? వారు బీదవాళ్ళు ఎట్లా అయ్యారో వాడికర్థంకావటంలేదు. వాళ్ళలాగానే ఇంకా ఎంతోమంది బీదవాళ్ళున్నారు. వాళ్ళకంతా ఒంటినిండా బట్ట, కడుపునిండా తిండానికి తిండి దొరకటం కష్టం; ఎప్పుడూ ఏదోఒక చాకిరీచేస్తూ వచ్చిన డబ్బులతో రోజులు గడుపుతుంటారు. మరి ఊళ్ళోవాళ్ళకు మంచిమంచి బట్టలున్నాయి. యిళ్ళుగూడా మేడలు, పెంకుటిళ్ళు. మంచి తిండి కడుపునిండా తింటారట. మరి వాళ్ళలాగా తమకెందుకులేవో; వాళ్ళలాగా తామెందుకుండరో వాడికి అర్థంగాని సమస్యగానే వున్నది.

దేవుడున్నాడట. ఆదేవుడే ఈ లోకాన్ని సృష్టించాడట. దేవుని దృష్టిలో అందరూ సమానులేనట; అని వాళ్ళ ఊరికి ఇంతకుముందు ఎవరో గొప్పాయనవచ్చి చెప్పాడు. ఆ విషయమే పంతులుగారు బళ్ళో అప్పుడప్పుడూ చెపుతుంటారు. మరి దేవుడు అందరినీ సమానంగా చూస్తే ఇటువంటి హెచ్చుతగ్గులు ప్రజల్లో ఎందుకున్నవో? ఈ విషయమే దేవుడు కనుపిస్తే అడగాలని వాడికుంది అయినా; దేవుణ్ణి చూడాలంటే ఎంతో శ్రమపడాలట. అది సామాన్యులకెవరికీ సాధ్యంకానిపనట. అంత శ్రమపడి దేవునిచూసినప్పుడు ఈ విషయమే అడగాలని నాగేశుకుంది. బుల్లిలాగు, బుల్లిచొక్కా ఊళ్ళో ఎవరో ఇచ్చారు. పాతవి. నిన్న వాడి అమ్మ తెల్లగా ఉతికిఆరవేసి ఇవాళ తొడిగింది. దేవుడు ఊరేగింపుకు బయలుదేరుతాడేమో? తొందరగా వెళ్ళాలని ఆరాటపడుతున్నాడు; నాగేశు. వాడి ఆరాటం చూచి వాడి తల్లి ఊళ్ళోనుంచి తెచ్చిన అన్నంపెట్టి రెండు గారెలిచ్చింది.

అవి తినేంతలో బాజాలు, బాకాలు వినిపించాయి. గుడి చాలాదూరం వుంది. ఆదరాబాదరాగా పరుగెత్తాడు నాగేశు. దేవుడూరేగుతున్నాడనీ; ఆయన్ను చూడాలనీను.

నాగేశు గుడిదగ్గరకొచ్చాడు. గుడిముందు రోడ్డుపైన రకరకాల దుకాణాలుపెట్టారు. రంగురంగుల బూరాలు, ప్లాస్టిక్కు బొమ్మలు ఎన్నోవున్నాయి. వాటిల్లో ఏదోఒకటి కొనుక్కోవాలని వుందిగాని, వాడి దగ్గర ఐదు పైసలున్నాయి. ఐదు పైసలకు దొరికేవస్తువేదీ అక్కడలేదు. అందుకని ఊరుకున్నాడు. గుడి ఆవరణలో ఎంతోమంది వున్నారు. అందులో తనలాంటి పిల్లలే ఎక్కువ. పెద్దవాళ్ళుకూడా చాలామంది వున్నారు.

నాగేశు రోడ్డుమీదినుంచి అంతా చూస్తున్నాడు. గుడి ఆవరణలోనికి వెళ్ళటానికి వాడికి భయంపుట్టింది. గుళ్ళోనుంచి దేవుడిని బయటకు తీసుకొచ్చి రథంలో కూర్చోబెట్టారు ఊరేగించటానికి. అప్పుడు బాజాలు బాగా మ్రోగించారు. ఇంకా ఊరేగే సమయం కాలేదట. నాగేశుకు దేవుడిని చూడాలనిపించింది. రోడ్డుపైనుంచే ఏమీ కనిపించటంలేదు బెరుకుబెరుకుగానే ఆవరణలోనికి ప్రవేశించాడు. దేవునికి కొంతమంది కొబ్బరికాయలు కొడుతున్నారు. అందరికంటే పిల్లల గలభా ఎక్కువగా వున్నదక్కడ.

నాగేశు పిల్లల హంగామా చూచి మెల్లిగా వాళ్ళ వెనుకకు వెళ్ళాడు. వాళ్ళంతా

రంగురంగుల చొక్కాలు, పొడుగు లాగులూ తొడుక్కొని వున్నారు. చక్కగా తలలు దువ్వుకొని తళతళలాడుతున్నారు. నాగేశు వాళ్ళవంకా, వాళ్ళ బట్టలవంకా అదేపనిగా చూడటం మొదలుపెట్టాడు.

వాళ్ళు తనను చూచి ఎగతాళిచేస్తారేమోనని వాడికి భయం. అందుకే బెరుకుగా వున్నాడు. ఇంతలో అనుకున్నంతపనీ అయ్యింది. కొందరి పిల్లల దృష్టి నాగేశుమీద పడింది. వాళ్ళకు పొట్టిలాగూ, పొట్టిచొక్కా తొడుక్కొని, తలంతా రేగివున్న అతడిని చూచేటప్పటికి అసహ్యమేసింది. అందరూ వాడివంక తిరిగి ఒక్కసారిగా "ఏయ్! నువ్విక్కడకు రాకూడదు. ఏబ్బే! ఇదేం చొక్కా ఇదేంలాగు, ఛో! ఛో!" అన్నారు.

నాగేశుకు చచ్చేంత పనైంది. నేలచూపులు చూస్తూ మెదలకుండా నుంచున్నాడు. మళ్ళీవాళ్ళన్నారు. "ఎవడ్రానీవు! పొమ్మంటేపోవు" అని. వాళ్ళలో ఒకడన్నాడు. "ఈడే! మాయింట్లో పనిజేసుద్దే; దాని కొడుకురా!" అని.

నాగేశుకు విచారం ముంచుకొచ్చింది. దుఃఖం పొర్లుకొచ్చి కళ్లు పూడిపోయినయ్! భూమి గిర్రున తిరుగుతున్నట్లయింది. కూలబడతానేమో అనుకున్నాడు. కాని తమాయించుకున్నాడు. వాడికి తెలుసు తనను ఇట్లా ఎగతాళి చేస్తారని. అందుకనే అక్కడసలు ఉండగూడదనుకున్నాడు. దేవుడిని చూడాలని ఎంతో హుషారుగా వచ్చినవాడికి, నిరుత్సాహం ఎదురయ్యింది. బిక్కమొఖం వేసుకొని, ఏడుపు లోపలే దిగమింగుకొని వెనక్కు తిరిగాడు; దేవుడిని కళ్ళారా చూడకుండానే!

బజార్లో దుకాణాలవాళ్ళ కోలాహలం ఎక్కువగా వుంది. వ్యాపారం జోరుగా సాగిపోతున్నది. బాజాలు తీవ్రంగా మ్రోగుతున్నాయి. రెండుమూడు చోట్ల గ్రామఫోను రికార్డులు మైకులోంచి చెవులు దిబ్బళ్ళెత్తేటట్లు మ్రోగుతున్నాయి. వాడికవేమీ ఆనందాన్ని తెప్పించలేదు. నేరుగా ఇంటికిపోవటమే మంచిదనుకున్నాడు.

"మనిషిని మహాత్మునిగా—మార్చగలిగినదేవా!
మా...
మనసులలో మాలిన్యం—మాయంజేయగరావా!
నీవుంటే ఈలోకం—నిండుస్వర్గమనిపించును
నీవులేని నాడిదియే—నరకమ్మును దలపించును
ప్రతి ఎదలో నీరూపం—పదిలంగా ఉండాలీ!
ప్రేమన్నది ఈ జగతిని—ప్రతిచోటా ఉండాలీ!
...మా...
ఉల్లములన్నీ విరియాలీ
మల్లెల జల్లులు కురవాలీ
ఆనందమ్మే వాహినియై
అవనియంతా పారాలీ॥"

అనేపాట మైకులోంచి గట్టిగా వినిపిస్తోంది. వాడి కది వినగానే ఏమిటో స్ఫురించింది

దేవునికి మారురూపమే మంచట ; పంతులుగారు చెప్పారు. పాటలోవున్నట్టే దేవునిరూపం అందరి మనస్సుల్లో వుంటే బావుంటుందిగదా ! వాడికి దారిని వస్తుంటే, ఏడుపు ఆగిపోయిందిగాని, గుడిసెదగ్గరికొచ్చి అమ్మను చూడగానే దుఃఖం వెల్లుబికి ఉరవడిగా కట్టలు తెంచుకొని పారే నదిలా ఒక్కసారి ఉధృతంగా వచ్చింది. ఒక్కసారి బావురుమన్నాడు. ఆమెకు తెలుసు తనకొడుకు తిరిగి ఆస్థితిలో వస్తాడని. "అసలు అక్కడికి వెళ్ళవద్దు, దేవు డూరేగుతూ బజారున వచ్చినప్పుడు చూద్దువుగాని" అని చెప్పింది కదా ! కాని వాడి ఆరాటంచూచి వద్దనలేకపోయింది.

"ఊరుకో నాయనా ! ఏడవకు, ఏం ? ఎవరేమన్నారు." అంది. నాగేశు ఉలకలేదు పలకలేదు. వాడి బాధ తీరిందాకా ఏడ్చాడు. ఆతరువాత మెదలకుండా ఊరుకున్నాడు. చూడకుండా వదిలేసి వచ్చిన రథంలోని దేవుడు జ్ఞాపకమొచ్చాడు. అంతే వాడికి దేవుడిపైన విచ్చికోపమొచ్చింది. కొంతమందిని ఆనందంగా, హాయిగా ఉండమని, తనలాంటి వాళ్ళను ఏడిపిస్తూంటాడు దేవుడు. ఛీ ! పాడు దేవుడు అనుకున్నాడు. కసితీరిందాకా లోపలే తిట్టుకున్నాడు. ఇంతా జేసి కోపం తగ్గిన తరువాత ఇంతకుముందు అమ్మచెప్పిన మాటలు "పూర్వజన్మంలో చేసుకున్న పాపపుణ్యాల ప్రకారం బాధలనుభవిస్తారు గాని, దేవుడేంచేస్తాడు" అనే మాటలు జ్ఞాపకానికికొచ్చాయి. వాడి మనస్సు తేలికయింది.

ఇంకా వాడేదో ఆలోచిస్తున్నాడు. వాడి దృష్టి గుడిసెతాటాకుకు వ్రేలాడుతున్న పటంపైన పడింది. సూర్యుడు పశ్చిమాన వున్నాడు ; అప్పుడు గుడిసెకప్పులోనున్న కంతలోంచి సూర్య కిరణాలు వచ్చి ఆ పటంపైన పడుతున్నాయి. ఆ పటం ఎప్పటిదో మరి ; నాగేశుకు ఊహ తెలిసినప్పటినుంచీ దాన్ని అక్కడ చూస్తున్నాడు. దాన్ని వాళ్ళమ్మ అప్పుడప్పుడూ తుడిచి, పసుపూ కుంకుమ రాసి, సాంబ్రాణి కడ్డీలు వెలిగిస్తుంది. పటం మాసిపోయి, పొగకు అలుక్కుపోయి ఏ బొమ్మలున్నదీ స్పష్టంగా కనువించటంలేదు. వెలుగులో బొమ్మలు స్పష్టాస్పష్టంగా కనువిస్తున్నాయి "అమ్మా ! అది ఏదేవుడిపటమే" ? అని వాళ్ళ అమ్మను అడిగాడు.

"అదా ! అది, మనల్ని రక్షించే భగవంతుడిది. తిరుపతి వేంకటేశ్వరస్వామిదిరా నాయనా !" అంది ! 'అయితే గుళ్లో దేవుడూ, ఈయనా ఒకటేనా ?'

"ఒకటేరా ! నాయనా ! అసలు ఇన్ని దేవుళ్లున్నా పేరు, రూపం భేదంగాని అందరూ ఒక్కటేరా !" అంది అమ్మ.

"అయితే నేను గుళ్లో దేవుడిదగ్గరకెళ్ళనులే ! ఈ దేవుడికే దణ్ణంపెట్టుకుంటాలే !" అని ఆ దేవుడికి దండంపెట్టుకొని "స్వామీ ! నీవే మాకు చాలు, మమ్మల్ని సుఖంగా, కాపాడు" అని ప్రార్థించాడు. అప్పుడు అతని హృదయం ఎంతో తేలికయ్యింది. గాలి వాన తగ్గిపోయిన తరువాత అలము కొనే ప్రశాంతత అలముకొంది మనస్సునిండా ! దూరంనుంచి బాజాలు భజంత్రీలు గట్టిగా వినిపించాయి.

"మాయింట్లో గూడా ఉన్నాడు దేవుడు, గుళ్లోకెళ్లి చూడకపోతేఏం ?" అనుకొని సంతృప్తి పడ్డాడు నాగేశు.

# 'ఓడిపోయాను'

కె. సత్యవతి

రైలు ఒక్క కూతకూసి స్పీడునందుకుంది. నా సీటు చూసుకుని కూర్చున్నాను. రాత్రి అవటంనుంచి రైల్లో లైట్లు గడ్డిదీపాల్లా వెలుగుతున్నాయి. ఆ లైట్లలోనే యెవరిపని వారు కానిచ్చుకుంటున్నారు ప్రయాణీకులు. కిటికీలోంచి తల బయటికి పెట్టి మూర్తిని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో మూర్తి ఉత్తరం గుర్తువచ్చింది. అంతకు ముందు యెన్నోసార్లు చదివిందే అయినా మళ్లీ చదవాలనిపించి జేబులోంచి బయటకి తీసేను.

"రాజూ చాలారోజులయింది, నీకు నేను రాసి, నీ దగ్గర్నుంచి నాకు వచ్చికూడ. ఇంత త్వరగా యిలా రాయవలసివస్తుందనుకోలేదు; మీ ఆఫీసులోనే పనిచేస్తున్న ఒక ఫ్రెండ్ద్వారా జరిగిన విషయం తెలిసింది. ఆ తరవాత పత్రికలో పడ్డ నీకథ చదివిన నాకు ఓ ఉత్తరం రాయాలనిపించింది.

జీవితంలో యెందరో వ్యక్తులు తారసపడతారు. అందరూ మన మనస్సులో ముద్ర వేసుకు కూర్చోలేరు. కొందరికే ఆ అర్హత వుంటుంది. వాళ్ళని మనం ప్రేమిస్తాం ఆరాధిస్తాం. శాసిస్తాం. అయితే అవతలివాళ్ళని యెక్కువగా అంచనా వేసుకున్నంతమాత్రాన మనని మనం తక్కువచేసుకోనక్కరలేదు. ఒక్కొక్కసారి యిది ఎలా దారితీస్తుందంటే మనమీద మనకి నమ్మకంపోయి చిన్నచూపు ఏర్పడే పరిస్థితి వస్తుంది. నీతో మొదట్నుంచి వచ్చిన చిక్కే యిది. అవతలివాళ్ళని భూతద్దంలోంచి చూస్తావు నీలో నీకు తెలియని అమాయకత్వం, మంచితనం ఉన్నాయి. అవి నీకు అర్థంకావు.

ఇకపోతే నీకథ చదివేను. నీలో రగులుతున్న బాధ నాకు అర్థమయింది కథలు జీవితంలోంచి పుట్టినా, జీవితం యెన్నటికీ కథకాదు. నీ ప్రియాతిప్రియమైన స్నేహితునిగా నేను కోరేదేమిటంటే నువ్వు పిచ్చిపిచ్చి ఆలోచనలు మాని యే త్యాగాలు చెయ్యకుండా వీలయినంత త్వరగా బయలుదేరిరా. చూడాలనివుంది..."

అది చదువుతుండగానే నా ఆలోచనలు గతంలోకిపోయాయి. పాత విషయాలు ఒక్కొక్కటీ గుర్తు వస్తున్నాయి. మూర్తి నేను చిన్నప్పట్నుంచి కలిసి చదువుకున్నాము. చాల చిత్రమైన మనిషి మూర్తి. ప్రేమిస్తూనే శాసించగలడు. అవతలివాళ్ళని పైకెత్తుతూనే తన వ్యక్తిత్వాన్ని పెంచుకోగలడు. మూర్తికి నాకు స్నేహంకూడ చాల చిత్రంగా ఐంది. ప్రతి విషయంలోను మా యిద్దరికీ సహస్రాంతం తేడా వుండేది. ఒక్క చదువులోనే కాకుండా మిగతా అన్ని విషయాల్లోనుకూడ పైచెయ్యిగా వుండేవాడు మూర్తి. నాది మొద

ట్నుంచి ఏవరేజి వైపు. అందుకేనేమో మొదట్నుంచి మూర్తంటే గౌరవంతోగూడిన ఆరాధన కలిగేదినాకు. అన్నిట్లోను ఔట్‌స్టాండింగ్‌గావుండే మూర్తంటే అందరూ అభిమానం చూపేవారు. కానీ మూర్తి మాత్రం అందరితో చాల తక్కువగా వుండేవాడు. అలాంటివాడికి యెలా కుదిరిందో నాతోటి. నేను యెంతదూరంగా వున్నా తనే దగ్గరికి వచ్చేవాడు. మూర్తితో చనువుగా మాట్లాడడానికిగూడా భయపడేవాడిని నేను. బహుశా ప్రతి విషయం లోను మా మధ్య వున్నదూరం వల్లనేమో నాలో ఆ భావన కలిగేది. కానీ మూర్తి మాత్రం నన్ను వదల్లేదు. అతని సహకారంవల్లనే కొద్దిరోజుల్లోనే కలిసిపోగలిగేను

రోజులు గడుస్తున్నకొద్దీ మామధ్య స్నేహం, ఆత్మీయత పెంపొందేయి. కానీఏవో తెలియని భావాలు కొన్ని నాలో చోటు చేసుకున్నాయి. మేము యెంత దగ్గరికి వచ్చినా ఆ భావాలు నాలో మెదులుతూనే వుండేవి. అవి మూర్తికి నాకు వున్న దూరాన్ని యెత్తి చూపుతూ వుండేవి. కాబట్టి మేము యెంత దగ్గరికి వచ్చినా నాకు తెలియకుండానే అంత దూరంగానూ జరిగేవాడిని.

యే విషయమైనా యిట్టే గ్రహించేవాడు మూర్తి. ఏదైనాసరే ఒకటికి రెండోసారి గాని అర్థమయేదికాదునాకు. మూర్తి తను అర్థంచేసుకోవటమే కాకుండా నాకు అర్థంచెప్ప టానికి ప్రయత్నించేవాడు. ఇది ఒకటి రెండు విషయాలలో అయితే ఫరవాలేకపోను. కానీ ప్రతి విషయంలోను అలాగే జరిగినప్పుడు నన్ను యేదో తెలియని బలహీనత ఆక్ర మించేది. మూర్తినుంచి వీలయినంత దూరంగా పారిపోవాలనిపించేది. కాని అదే సాధ్య మయేదికాదు మూర్తిదగ్గర. మూర్తివాళ్ళు కాస్త వున్నవాళ్ళు. మాది మొదట్నుంచి అంతంత మాత్రంగా వుండే కుటుంబం అవటంనుంచి యెన్నోసార్లు ఆర్థికంగాగూడ హాయం చేసేడు. నేనంటే పిచ్చి అభిమానం చూపెట్టేవాడు. కొన్నికొన్ని పరిస్థితుల్లో నాకదే భరించరానిదిగా వుండేది. మా యిద్దరికీ యే విషయంలోను పోటీఅంటూ వుండేది కాదు. దీనికి కారణం బహుశా గెలుపు యెలాగా మూర్తిదేనని ఖాయమవటం వల్లనేమో. కాబట్టి నాకు తెలియకుండానే నా ఓటమిని అంగీకరించేవాడిని.

అలాగని మూర్తి మీద మరోవిధమైన భావమేమీ వుండేదికాదు. మూర్తి చూపించే అభిమానానికి ఏవిధంగాను ఋణం తీర్చుకోలేనేమో అనిపించేది. నాకింకా జ్ఞాపకంవుంది యస్.యస్.ఎల్.సి. లో లెక్కల పేపర్ పాడుచేసేను. మూర్తి యెప్పుడూ లాగే బాగా చేసేడు. అప్పుడు మూర్తి అన్నాడు. 'నువ్వు పాడుచేసేనంటే నేను బాగా చేసినా నాకు తృప్తిగాలేదు రాజూ'అని. అప్పటికే కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్న నాకు పూర్తిగా బయటికి వచ్చేసేయి మూర్తి మాటలతో.

మరొకసారి అలాగే బి.ఏ. లో వుంటూండగా నాకు జ్వరంవచ్చింది. యేనాడూ క్లాసులు యెగ్గొట్టని మూర్తి ఆ వారంరోజులూ నాకోసం యెన్నో క్లాసులు మిస్సయేడు. అలాంటప్పుడు మూర్తి ఆత్మీయత, అభిమానం చూస్తే యెంతో గర్వంగా వుండేది తనకి.

మొత్తంమీద అలా పూర్తయింది మా గ్రాడ్యుయేషన్. బి.ఎ.లో నాకు సెకండ్‌క్లాసు

రావడానికిగూడ నగం కారణం మూర్తంటే అతిశయోక్తికాదేమో. మూర్తిమాత్రం యూనివర్సిటీ రేంకుస్లో పాసయాడు.

ఇంటికి వచ్చిన నాకు కొత్త చుట్టాన్ని పరిచయం చేసేరు అమ్మా నాన్న. ఎవరో వరసకి మావయ్య అవుతాడుట. పెళ్లీడుకూతురుందిట. నాకు ఉద్యోగమిప్పించి మరీ పెళ్ళి చేస్తానన్నాడు. ఇంటికి రాగానే ఈ ధోరణిచూస్తే నాకు చికాకు వేసింది. కానీ అమ్మా నాన్న చెవిని యిల్లు కట్టుకుపోరి, వాళ్ళ కష్టసుఖాలన్నీ చెప్పి నాచేత అవుననిపించారు. మా ఆర్థిక పరిస్థితి తెలుసున్న నాకు కూడ ఒప్పుకోక తప్పలేదు.

ఉద్యోగంకోసం యెన్ని తిప్పలు పడాలీ అనుకున్న నాకు పెద్ద శ్రమయేమీ లేకుండానే వచ్చింది కాబోయే మావగారి చలవవల్ల. కానీ చిత్రం యేమిటంటే అక్కడకూడ మూర్తి తటస్థపడ్డాడు నాకు. ఈ విషయం నాకు మావయ్య ద్వారానే తెలిసింది. ఆనాడు మావయ్య అన్నమాటలు నాకు చెవుల్లో యింకా గింగురుమంటున్నాయి. "నా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. మూడు వంతులు ఈ ఉద్యోగం అయిపోయినట్టే. అన్నట్టు నీకు తెలుసునటోయ్. యెవరో మీవూరి వాడేనుట. మూర్తిఅని బి.ఎ. యూనివర్సిటీ రేంకుస్లో వచ్చేడుట. ఇంటర్వ్యూలోగూడ చాల ఇంప్రెషన్ చేసేడుట. ప్రస్తుతం అతనొక్కడే అడ్డు యేదోఒక దారిచూసి అతన్నికూడ తప్పిస్తే యింక ఈఉద్యోగం నీకు ఖాయమయినట్టే."

అది వింటూన్న నాకు నోట మాట రాలేదు. మూర్తి ఈ ఉద్యోగానికి అప్లయి చేసినట్టు నాకు తెలియదు. ఎవరో తెలియని వాళ్లు అయితే యిదిప్పుడు ప్రతీచోటా జరిగేదేనని సరిపెట్టుకుని వుండును కానీ మూర్తి నా ప్రాణస్నేహితుడు నాకు సూదిగుచ్చుకుంటే బాధపడే మూర్తికి యింత అన్యాయం చెయ్యాలంటే యేమిటోలా అనిపించింది మావయ్యకి. చెప్పెయ్యాలనిపించింది. "మావయ్య మూర్తి నేను ప్రాణస్నేహితులం ఈ ఉద్యోగం మా యిద్దరిలో యెవరికి వచ్చినా నాకు సంతోషమే. కాబట్టి యింతటితో ఈ విషయం వదిలెయ్య"మని

కాని గొంతు యెవరో పిసికినట్టు మాటలన్నీ మనసులోనే వుండి పోయేయి. పైకి పెగిలి రాలేదు. యేవేవో ఆలోచనలు తరుముకు వస్తున్నాయి. ఎంత తప్పించినా ఆలోచనలు ఆగటం లేదు. మూర్తి యింతకి యింతై పెద్ద పర్వతంలా నాముందు కనువించాడు. దాని ముందు నేను నా వ్యక్తిత్వం గులక రాళ్ళలా అనిపించాము. యేది తెలియని అసంతృప్తి చోటు చేసుకుంది. ఈ విధంగానైనా యేదైనా సాధించాలనిపించింది. మూర్తిముందు ఎదిగి పోవాలనిపించింది. అంతే ఆ భావమేనేమో నానోట మరొకమాట రాకుండా చేసింది

అనుకొన్నట్లుగానే మరికొన్నాళ్ళకి ఉద్యోగం వచ్చింది నాకు. ఆ సరదాలో కొత్తల్లో బాగానే గడిచిపోయింది. రోజులు గడుస్తున్న కొద్ది నాలో తెలియని అసంతృప్తి అసహాయత ఆవరించేయి. అస్తమానం మూర్తి గుర్తువచ్చేవాడు, ఉద్యోగానికి రాజీనామా యిచ్చి ఆ నుడిగుండం నుంచి తప్పించుకు పోవాలనిపించేది. నాద్వారా మూర్తికి జరిగిన అన్యాయం తలుచుకుంటే ఈ జన్మలో మూర్తి మొహం చూసే అర్హత నాకు లేదనిపించేది.

మూర్తి దగ్గరకి పోయి అతని వళ్లో తలపెట్టుకుని నన్ను క్షమించమని తనివితీరా యేడవాలనిపించేది. ఆలోచనలు పిచ్చి వాణ్ణి చేసేవి. యేదో చేసెయ్యాలనిపించేది.

ఆ పరిస్థితిలో ఒక కథ మలిచి నా బాధని ఎక్స్‌ప్రెస్ చెయ్యడానికి ఔట్ లెట్‌గా వినియోగించు కున్నాను. నా పరిస్థితిలో వున్న కథలోని పాత్రచేత రాజీనామా యిప్పించి పశ్చాత్తాప పడేటట్లు చేసేను. ఆ కథకి ఫలితం మొన్నటి మూర్తి వుత్తరం.

రైలు ఆగిన కుదుపుకి నేను నా ఆలోచనల్లోంచి బయట పడ్డాను. ఎంతో మారి పోతాడు, యేదో అయిపోతాడు అనుకున్న మూర్తి, యేమీలేకుండా మునపటి లాగే నేనంటే ప్రాణం పెడతాడనుకోగానే కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. మూర్తి ఉత్తరంలో వాక్యాలు గుర్తు వచ్చేయి, నాలోనాకే తెలియని అమాయకత్వం మంచితనం వున్నాయట, రాక్షసుల్లో కూడ మంచితనం చూసే నేర్పు మూర్తికే వుందేమో అనిపించింది.

ఇన్నాళ్ళు యేమోగాని యిప్పుడుమాత్రం నాకు తెలిసీ మనస్ఫూర్తిగా మూర్తి ముందు నా ఓటమి నంగీకరించటంలో యేదో తెలియని సంతృప్తి కలిగింది.

మూర్తి దగ్గరికి నన్నెంత త్వరగా చేరుద్దామా అన్న ఆతృతతో రైలు గమ్యంవైపు సాగి పోయింది.

# అఘాయిత్యం

చేగొండి రామజోగయ్య

ఈ సారి నాకు మా ఆవిడమీద చాల కోపంవచ్చింది! అంటే ఇదివర కెప్పుడూ అర్థాంగిమీద నాకు కించిత్తైనా కోపం రాలేదనికాదు. మాకు పెళ్ళయిన ముహూర్తం ఎటువంటిదోగాని 'తను' నాకు కోపం తెప్పించని రోజు లేనేలేదు. అయినా 'భార్యానుకూలుడి'గా ఉండటం అలవాటయిపోయిన నేను ఎప్పుడూ కోపాన్ని దిగమింగు కొంటూనే ఉంటాను. ప్రతి చిన్న విషయంలోను తన ఇష్టమే చెల్లించుకొంటున్నా లోలోపలే ఉడికిపోతూ, పైకి నోరెత్తకుండా, ఈ సంసార సాగరాన్ని ఏదో నేనుకాబట్టి ముఖంమీద చిరునవ్వు చెదరకుండా ఈదుకొస్తున్నాను. ఏదో పోనీలేకదా అని, అలా మొదట్నుంచీ తను ఆడిందే ఆటగా, పాడిందే పాటగా జరుపుకొస్తున్నాను గాబట్టే తను ఈనాడు నాకింత అనుచితమైన ఆజ్ఞ జారీ చేసింది; ఎప్పటిలానే అభ్యర్థన రూపంలోనే—

ఈసారి మా ఆవిడ; ''రాణీ'' అను సార్థక నామధేయురాలు, నన్ను కోరిన 'చిన్నకోరిక' వినగానే నాకు వళ్ళు కంపరమెక్కింది. మెదడు మొద్దెక్కిపోయింది. ఇంతకూ తను నన్ను కోరిన 'కోరిక' ఆవిడి భాషలోనే చెప్పాలంటే—'సుందరిమీద' "అఘాయిత్యం" చేయబోవాలట—రామ! రామ! ఎంత ఘోరకలి!!— ఒక ఆడకూతురిమీద, అందునా, 'ఇంటావిడ' కూతురిమీద, ఏకపత్నీ వ్రతుణ్ణి, సంస్కారవంతుణ్ణి అయిన నేను 'చెయ్యి' వేయబోవాలట! అసభ్యంగా రెండు డైలాగులు చెప్పాలట!! 'పోనీలే, ఏదో మనపెళ్ళామే కదా; అణుకువుగా, అనుకూలంగా ఉంటేనే మంచిదిలే, పోయిందేముందిలే' అనుకొంటూ, పరిస్థితులతో రాజీపడిపోయి, అన్ని విషయాల్లోను తను ఎలా చెబితే అలా చేస్తున్నానుకదా అని, నాకిలాంటి పనిచెప్తుందా? ఇలాంటి అసందర్భమైన కోరిక; ఇంతవరకు ఈ భూ ప్రపంచంలో ఏ భార్యా తన భర్తని అడగని కోరిక నాముందు వెలిబుచ్చుతుందా! ఈ సారేమయినాసరే తనకి లొంగకూడదు— ఈ ఒక్క విషయంలోనైనా నా వ్యక్తిత్వాన్ని, పెళ్ళయిన తర్వాత మొదటిసారిగా నిలబెట్టుకోవాలని నిర్ణయించేసుకొన్నాను—అందుకే ఎలాగో ధైర్యం ప్రోగుచేసుకొని—''లాభంలేదు రాణీ!... ఈ పని నేను చేయలేను—నువ్వింకోమార్గం చూసుకో'' అనేశాను, నా మెడచుట్టూ ప్రేమపాశంలా చుట్టుకొంటున్నా తామర తూడుల్లాంటి తన మెత్తని చేతుల్ని దృఢ సంకల్ప బలంతో తొలగిస్తూ—నిజానికి, నాకు మా ఆవిడ ఆడించదలుచుకొన్న నాటకం, అందులో నేను నటించవలసిన పాత్ర వివరాలు వినగానే ఎంతో కోపం వచ్చింది కాని ఆ కోపాన్ని తన మీదనే ప్రయోగించటం క్షేమకరంకాదుగాబట్టి సదరు కోపాన్ని ఆ సమయానికి అక్కడలేని సుందరిమీదికి మరలించాను—

అవునుమరి! ఆచుప్పనాతి వల్లనేకదా, మా ఆవిడ నాకింత క్లిష్టమైన సమస్య తెచ్చి పెట్టింది—ఈ సుందరి పూర్తిపేరు వీరవెంకటసత్య సూర్యవరప్రసాద త్రిపుర బాలసుందరి —మా "ఇంటావిడ"—అంటే మాకు తన ఇంట్లో ఒక భాగాన్ని అద్దెకిచ్చిన గంగా భాగీరథిసమానురాలు, శాంతమ్మగారి ఏకైక గారాలకుమార్తె— నా ఖర్మకాలి సదరు సుందరి ఆరునెలల క్రితం నిజ భర్తతో ఏదో చిన్న విషయంలో పెద్దగా పోట్లాడి, తీవ్ర మైన విభేధాలు తెచ్చుకొని, తల్లిచేయించినవీ, మొగుడుచేయించినవీ నగలన్నింటినీ మర్చి పోకుండా పెట్టెలో సర్దుకొని పుట్టింటికి చక్కావచ్చింది. అంతే అప్పట్నుంచీ ఇక్కడే తన తల్లి గుండెలమీద తిరిగి రగుల్కొన్న కుంపటిలా ఉండిపోయింది. ఎవరెన్ని చెప్పినా భర్త రాయబారాలు పంపినా, కన్నతల్లి ఎంత మొత్తుకొన్నా లెక్కచేయకుండా, గంటకో తెలుగు నవల, రోజుకో హిందీ సినిమా చూస్తూ—పైగా మారాణితో బాతఖానీ వేయటం కోసం, తనుఇచ్చే కాఫీ టిఫిన్ వగైరాలు ఆరగించటం కోసం అస్తమానూ, మా 'భాగం' లోనే తిష్ఠవేయటం, తద్వారా నా 'అర్ధభాగం'తో నాకు ఏకాంతం లేకుండా చేయటం తరుచుగా ఆవిణ్ణికూడా సినిమాలకి తీసుకుపోయి నాకు దూరంచేయటం నాకిన్నాళ్ళుగా కంటంగానే ఉంటున్న విషయాలు.

'అక్కా, అక్కా' అంటూ తనతో ఎంతో అభిమానంగా ఉండే సుందరి కాపురం చక్కదిద్దాలన్న కోరిక మొదట్నుంచీ మారాణీ గుండెల్లో గూడుకట్టుకొనుందనీ నాకు తెలుసు— తిరిగి భర్త దగ్గరికి వెళ్ళటమే మంచిదని ఆవిడికి నచ్చజెప్పాలని ఎన్నోసార్లు విఫల ప్రయత్నాలు చేసిందనీ తెలుసు.

"భారతస్త్రీకి భర్తే సర్వస్వం— అతడితోడిదే లోకం— లేకుంటే శాశ్వతశోకం- తెలుసుకోవే పిచ్చిమాలోకం......!" అని మా ఆవిడ బరువుగా పలికే డైలాగులకు; "వ్యక్తిత్వం చంపుకొన్న సతీత్వం వద్దు— అదికాదు నాతత్వం"— అంటూ సరిగ్గా తూకంవేసినట్టు సరిసమానమైన డైలాగులు సుందరి సమానంగా పలుకుతూండటం పక్క గదిలోంచి నేను చాలసార్లు వినోదంగా విన్నాను—

ఇంతకీ మా ఆవిడ నా మెడచుట్టూ ఆప్యాయంగా చేతులువేసి ఎంతో లజ్జుగాచెప్పిన ఉపోద్ఘాతంయొక్క సారాంశమిది—

ఈమధ్య ఒకరోజున సుందరితల్లి; గం॥భా॥స॥ శాంతమ్మగారు "అమ్మా రాణీ! నువ్వు బృహస్పతిని మించిన తెలివైనదానివి— కాబట్టి గట్టిగా తల్చుకొంటే ఏమైనాచేయ గలవు— ఏదోఒక ఉపాయం పన్నినా కూతురి కాపురం గట్టెక్కించుతల్లీ' అని ప్రతి మాలి; ఆనక— "అలా చేయగల్గితే, నేను వీలయినంత తొందరగా చచ్చిపోయి; వెను వెంటనే నీ కడుపున పుడతానమ్మా—" అని ముక్కుచీదుకుంటూ కనీళ్ళు ధారాపాతంగా వర్షిస్తూ గట్టిగా వాగ్దానం చేసేసిందట; పిల్లలులేని మారాణీ బలహీనతలు తెలుసున్నది గాబట్టి—!!

అంతే! దాంతో మా ఆవిడ ఉబ్బిపోయి వెంటనే 'మాట' ఇచ్చేసిందట ఆ గంగా భాగీరథీ సమానురాలికి!!!—

—ఆ ఇచ్చిన మాట ప్రకారం సుందరిని మార్చటానికి తన ప్రయత్నాలు తిరిగి కొనసాగించిందట. సుందరిని ఒకసారి మా పందిరి మంచంమీద కూర్చోబెట్టి, బాగా టిఫిన్ పెట్టిన తర్వాత తన శక్తి యుక్తులన్నీ ఉపయోగించి ఒక పెద్ద లెక్చరిచ్చి అదరగొట్టేసిందట!— తురుపు ముక్కగా బ్రహ్మాస్త్రంగా ఆఖరి పాయింటుగా "భర్తతోగాక వేరేఉన్న ఆడదాన్ని సమాజం గౌరవించదని; అలాంటిదాన్ని అంతా చులకనగా చూస్తారని, సాంఘిక రక్షణ ఉండదని, ఆఖరికి ఆవిడ శీలాన్నికూడా శంకిస్తారని" గుక్కతిప్పుకోకుండా ఉపన్యసించి బెదరగొట్టేసిందట!!—

పైకి అంతగా తేలకపోయినా, సుందరి మనసుకి తను ఎంతో తెలివిగా చెప్పిన ఈ పాయింటు నాటిందని, ఆవిడ మూర్ఖత్వాన్ని కొంతలోకొంత సడలించగలిగిందని, కొంచెం పునరాలోచనకు పూనుకొనేలా చేసిందని మా ఆవిడ గట్టి నమ్మకం! అందుచేతనే ఇదే వేడిలో దానికి తగ్గట్టుగా ఒక 'సంఘటన' సుందరికి జరిగేలా చేయగల్గితే ఆవిడ తప్పని సరిగా తన అభిప్రాయాల్ని మార్చుకొని, భర్త నీడకు చేరుకొంటుందని, కాపురం చక్క దిద్దుకొంటుందని ఎంతో ఆలోచించిన పిదప తిరుగులేని నిర్ణయానికి వచ్చిన మా ఇల్లాలు నాకీ 'చిన్నపని'ని చేయమని కోరవలసి వచ్చిందట!!

కాని సదరు 'చిన్నపని'ని— అదే సుందరిపై 'అఘాయిత్యం'చేయబూనుకొన్నట్లు నటించి, రెండు అసభ్యపు డైలాగులు చెప్పటానికి నేను అంగీకరించనని ఖచ్చితంగా చెప్పగలిగేసరికి తలక్రిందులయిపోయింది— అయినా మొండిఘటం, ఓ పట్టాన వదులుతుందా! తన మంకుపట్టు విడవకుండా ఓ రెండుగంటలసేపు నా చెవులూదరగొట్టింది. తన ఈ ప్లానువల్ల ఆశించిన ఫలితాలుండవేమోనని నేను మెల్లగా నసిగి, తప్పించుకొందామని చూశాను. దాంతో రెచ్చిపోయి తన 'పథకం'లోని బాగోగుల్ని మళ్ళీ వివరించింది. సుందరికి ఎలానూ నేనంటే మంచి అభిప్రాయమే వుందిగాబట్టి, అలాంటి నేనే తనపై 'అఘాయిత్యం' చేయబూనుకొంటే భర్త నీడనిలేని ఆడదానికి సమాజంలో ఎంత భద్రత ఉంటుందో, అలాంటిదాన్ని సహజంగా మంచివాళ్ళయినవాళ్ళుకూడా ఎంత తప్పుగా ఊహించుకొంటారో, బజారు స్త్రీతో సమంగా ఎలా చూస్తారో చక్కగా తెలిసివస్తుందని మారాణీ వాదం. చిన్నచిన్న సంఘటనలే గొప్పగొప్ప ఫలితాలకి కారణాలవుతాయన్నది తన దృఢమైన నమ్మకం— ఉదాహరణకి, ఆ మధ్యన తను చూసిన ఒక సినిమాలో ఎవరెలా ప్రయత్నించినా త్రాగుడు మానలేకపోయిన ఒక 'దేవదాసు'; ఆఖరి రీలులో తన పెళ్ళాం పూటుగా తాగినట్లు నటిస్తూవచ్చి, ఒక 'ఎల్లారీశ్వరి' పాట ఎత్తుకొని ఒక క్లబ్బుడాన్సు చేసేసి, ఆపైన మత్తుగా తన వళ్ళో వాలిపోయేసరికి బేజారెత్తిపోయి, అనక పశ్చాత్తాపంకూడా పడిపోయి; తనిక తాగుడు పూర్తిగా మానేయాలన్న దృఢనిర్ణయానికి వచ్చేశాడట! అలాగే ఈమధ్యనే తను చదివిన ప్రముఖ రచయిత్రి సీరియల్‌లోని హీరోయిన్ 'సంఘసేవ' పిచ్చిలో పడిపోయి ఒక ఇరవై వారాల కథ అయేవరకు మొగుణ్ణి పిల్లల్ని నిర్లక్ష్యంచేస్తూవచ్చి, ఆఖరివారం కథలోమాత్రం కలెక్టరుగారు మీద చెయ్యివేయబోగా, ఆయన్ని రెండు పేజీల తిట్లుతిట్టి, దార్లో రెండు కేజీల స్వీట్లు కొనుక్కొని ఇంటికి

పరుగెత్తుకొనివచ్చి మొగుణ్ణి పిల్లల్ని ముద్దులాడి "నాకు జ్ఞానోదయమయింది— ఇక ఇంటిపట్టునే ఉంటాను— నా చేత్తోనే మీకు స్వీట్లు తినిపిస్తాను. దీన్ని మించిన సంఘసేవ లేదు" అనేసిందిట— ఇలాంటి చిన్నచిన్న సంఘటనలద్వారా జ్ఞానోదయం పొందిన పాత్రలు ఎన్నోఉన్నాయట, తను చదివిన సీరియల్సులో—కాబట్టి నేను కొంచెం 'రిస్కు' తీసుకొని సుందరిమీద దురభిప్రాయమున్నట్లు నటిస్తే ఒక కాపురాన్ని నిలబెట్టినవాణ్ణవుతానని మారాణీ వాదం!!

ఆవిడ వాదాన్ని ఖండించగల్గే శక్తి నాకెలానూలేదు కాబట్టి, అలాంటి ప్రమాద పూరితమైన పనులకొడిగట్టే సాహసం నాకులేదని ననిగాను. దాంతో ఇంకా వేడెక్కిపోయింది.

"ఒక కాపురం నిలబెట్టటంకోసం ఆమాత్రం సాహసంచేయవచ్చండీ అంది..." నేనయినా మీకేపాపకార్యం పురమాయించటంలేదే! ఉత్తినే 'అఘాయిత్యం' చేయబూనుకొన్నట్లు నటించమంటున్నానుగాని నిజంగా కీచకుడిలా ప్రవర్తించమనటంలేదే!— నా బంగారు కొండ, అలాంటి పనులు కలలోకూడా చేయలేరని నాకు తెలియదా' అంటూ ఉబ్బు మంత్రంకూడా వేసింది.

"నామీదెంతో అనురాగం ఉందంటారే, ఒక సత్కార్యం చేయటంలో అర్ధాంగికి మాత్రం సహకారం చేయమంటున్నారే!" అని చెప్పింది. తర్వాత కనీళ్ళ కుళాయికూడా విప్పేసింది!

"ఈ కోరిక తీర్చకపోతే నేను రేపే మూటాముల్లె కట్టుకొని పుట్టింటికి తగలడతాను" అని బెదిరించింది!—

దాంతో నా 'దృఢసంకల్పం' తప్పనిసరిగా చాలావరకు సడలిపోయింది! అది కని పెట్టే కాబోలు, ఆఖరిఅస్త్రం— అదే 'మన్మథాస్త్రం' వదిలేసింది, మరి నా బలహీనతలన్నీ బాగా తెలుసున్న జాణగాబట్టి 'నా బంగారు స్వామికదూ— ఈ ఒక్కవరంకాదనకండీ! ఇంకెప్పుడూ ఏమీ అడగనుగా... ఏమండీ... సరేననరూ..." అనురాగ లతలా నన్ను నిలువెల్లా చుట్టుకుపోతూ ఉక్కిరిబిక్కిరయేలా 'మోహపాశం' మధురంగా బిగించేసరికి 'అర్భకుణ్ణి' లొంగిపోయాను!— ఓటమికి చిహ్నంగా మౌనంగా ఉండిపోయాను!

"...అమ్మయ్య! శ్రీవారు ఒప్పుకొన్నారన్నమాట... నాకు ముందే తెలుసు... నామీద మీకుగల అంతులేని అనురాగం మిమ్మల్నెంతటి త్యాగానికైనా సంసిద్ధంచేస్తుందని. మీవంటి భర్త లభించిన నేను ఎంతో అదృష్టవంతురాల్ని... అదృష్టవంతురాల్ని... హే! భగవాన్...! నాకీ అదృష్టంచాలు...! నాకీ అదృష్టంచాలు...! అంటూ కళ్ళు సగం మూసుకొని నా చేతుల్లోకి వరిగిపోయింది; అచ్చు కథల్లో, సినిమాల్లోలా ఆనందపారవశ్యంతో మూర్ఛపోయిందేమోనని కంగారుపడి, తనని గట్టిగా కుదిపేశాను.

"అబ్బ! ఏవిటీ కొంటెవేషాలు..." అంటూ నన్నింకా గట్టిగా హత్తుకుపోయింది. నన్నేవో కొత్త లోకాల్లోకి ఎత్తుకుపోయింది— అంతే తర్వాత చాలాసేపటివరకు నాకు మళ్ళీ మాట్లాడగల్గే అవకాశం దొరకలేదు.

ఏదో అలా తప్పనిసరయి ఒప్పేసుకొన్నానుగాని, 'ఇదంతా ఎలా కడదేర్చగలనా అన్న ఆందోళన క్షణక్షణానికి అధికమవ్వసాగింది. నాకింతటి ఆందోళనను కలుగజేసిన మా ఆవిణ్ణి ఎలానూ ఏం అనలేను కాబట్టి; మొగుణ్ణి వదిలేసొచ్చిన సుందరిని; అలాంటి దాన్నికన్న గంగా భాగీరథీ సమానురాలు శాంతమ్మను, పెళ్ళాన్ని నాలుగు తన్ని కాపు రానికి తీసుకొని వెళ్ళలేని వాజమ్మయిన సుందరి తాలూకు మొద్దుమొగుణ్ణి; మా ఆవిడి కిలాంటి ఘోరమైన ఐడియా రావడానికి కారణాలైన తెలుగు సినిమాల్ని; ధారావాహి కంగా ప్రచురించబడ్డ సీరియల్సు వ్రాసిన రైటరీమణుల్ని: మనసులోనే గట్టిగా కసిగా తిట్టుకొన్నాను; అంతకుమించి చేసేదేంలేక—

ఆ మర్నాడు మధ్యాహ్నం మూడు దాటిన వెంటనే మా ఆవిడ ఎక్కడికో ప్రయాణమవ్వటంచూసి చాల గాభరా కలిగింది. ఏదో తప్పనిసరయి తను చెప్పినట్టుచేస్తా నని మాటనిచ్చేశానేగాని, అది ఇంత త్వరలోనే చెల్లించుకోవల్సిన ఆగత్యం ఏర్పడుతుం దని నేననుకోలేదు. లాభంలేదని తెల్సినా 'తర్వాతచూదాం రాణీ!ఈవేళమాత్రం వద్దు'అని ఎంతగానో గడ్డం పుచ్చుకొని బ్రతిమాలాను. అన్నిటికి సమాధానంగా చిరునవ్వుచిందిస్తూ గబగబా ముస్తాబయిపోయింది. ఇకచేసేదేమీలేక అలాగే దిగాలుపడిపోయి కూర్చున్నాను.

"సుందరీ నేను తప్పనిసరి పనిమీద బయటకు వెళ్తున్నాను... మావారేమో ప్రొద్దు ట్నుంచీ విపరీతమైన తలనొప్పితో బాధపడుతున్నారు. కాస్త దయచేసి చూస్తూండూ... కాసేపయినాక కాస్త కాఫీ పెట్టివ్వు... రాత్రి ఎనిమిదికల్లా వచ్చేస్తాను......" అంటూ వరండాలోంచి మా ఆవిడ మాటలు వినపడగానే నీరసం ముంచుకొచ్చి మంచంమీద వాలి పోయాను. సుందరి ఏం సమాధానం చెప్పిందో వినపడలేదుగాని రాణీ జోళ్లు టకటక లాడించుకొంటూ, నాతో మాటమాత్రమైనా చెప్పకుండా వీధితలుపులు చేరవేసి బయటకి సాగిపోవటం తెలిసి ఇంకా వళ్ళుమండింది. టక్...టక్...టక్... వీధి మెట్లమీద మా ఆవిడ జోళ్ళ చప్పుడు దూరంకాగానే అదే చప్పుడు నా మనోవీధిలో ప్రతిధ్వనించసా గింది... నిజంగానే విపరీతమైన తలనొప్పి ప్రారంభమయింది! అయినా అంతరాంతరా ల్లో నే నాశించినట్లుగా సుందరి లోపలికి రాలేదు! నన్ను పలకరించలేదు!

అవునుమరి! పిచ్చిమాలోకం; మా ఆవిడికి తెలియదుగాని, అప్పుడప్పుడు సుందరి, దొడ్లో బట్టలు ఆరవేస్తున్నప్పుడు, తడిచీర వంటికి చుట్టుకొని, బాత్‌రూంనుండి ఇంట్లోకి పరుగెత్తుకొని వెళ్ళున్నప్పుడు నేను కిటికీ దగర నిలబడి ఆవిడి వంపుసొంపుల్ని, మిట్ట పల్లాల్ని పరవశంగా, దొంగతనంగా చూస్తూంటాను. ఈ విషయం గమనించి ఒకటిరెండు సార్లు సుందరి నావైపు కోపంగా; అదోలా చూసిందికూడాను; నా అదృష్టం బాగుండి మా ఆవిడికి 'రిపోర్టు' చేయలేదుగాని! అందుకే సుందరిరాదు... పోనీలే అదేమంచిది... నాకు విషమ పరిస్థితి తప్పుతుంది.

ఇంతలో మా వంటింట్లోంచి కాఫీ పెడుతున్నట్లు గిన్నెల చప్పుడు వీనులవిందు వినపడసాగింది. ఓహ్! సౌందర్యదేవత సుందరి నాకోసం కాఫీ పెడుతోంది...! చక్కని కోలముఖంలో చక్రాల్లాంటి కవ్వించే కళ్ళు... సన్నని నున్నని నడుము... స్వచ్ఛమైన

మంచులాంటి తెల్లని పొట్టమీద కూర్చున్నందువల్ల పడిన ఆకర్షణీయమైన ముడతలు... సగం తొలిగిన పైట క్రింద ఎగిరెగిరి పడుతున్న యవ్వనం... గుండ్రని జబ్బలు... కాంతులీనుతున్న బుగ్గలు... మొత్తానికి సౌందర్యానికి నిర్వచనంలా ఉండే సుందరి స్వరూపం ఒక్కసారిగా మనోవీధిలో తళుక్కుమంది, అంతే కొన్ని క్షణాలకన్న ఎక్కువసేపు మంచంమీద ఉండలేకపోయాను— వద్దనుకొంటూనే లేచివెళ్ళి వంటింటి గుమ్మంలో నిలబడ్డాను; వణుకుతున్న కాళ్ళను అదుపులో పెట్టటానిక్కి విశ్వప్రయత్నాలు చేస్తూ—

ఆరవిచ్చుకొన్న పద్మాల్లాంటి పాదాలు... పాలరాయిలా నున్నగా, తెల్లగా ఉన్న కాళ్ళు కనపడేలా కుచ్చెళ్ళు పైకెగదోపుకొని, మనస్సుకాహ్లాదాన్ని కలిగించేలా అందంగా కోతకు వచ్చిన పైరులా, అందమైన వంపులన్నీ దర్శనమిచ్చేలా ముందుకు వంగొని జారిన పైటను, గుమ్మంలో నుంచొన్న నన్నూ, గమనించకుండా తన పనిలో నిమగ్న మయిపోయిన సుందరిని పరవశంగా చూస్తూండిపోయాను. కొంతసేపటివరకు స్టౌమీది కాఫీ నీళ్ళలా ప్రణయం పొంగసాగింది.

అంతలోనే సుందరి వెనక్కి చూసింది... ఆదోలా చూసింది... అంతలోనే నా కర్థంకాని విధంగా, నవ్వీనవ్వకుండా నవ్వింది... మామూలు పలకరింపు నవ్వేనా అది!

ఇంతలో పొయ్యిమీది కాఫీనీళ్లు పొంగగా వెంటనే పైటచెంగుతో పట్టుకొని గిన్నె క్రిందికి దింపింది. నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్న వంపులు మరింత స్పష్టంగా కనపడేలా! అంతే! నాకు ప్రణయావేశం పూర్తిగా తలకెక్కింది.

సుం...ద...రీ" రెండడుగులు ముందుకువేశాను!

"ఊ..." కొంచెం బెదురుగా పలికి తలవంచుకొనే కాఫీ చలారబెట్టసాగింది. దాంతో నా ఆవేశం ఒక్కసారిగా చల్లబడిపోయింది. అకస్మాత్తుగా మనోపథంలో మా ఆవిడ ఎదు రవ్వటం ఇంకో కారణమనికూడా చెప్పవచ్చు!—

అయినా ఇదేమిటి! నా అసలుపాత్ర మరిచిపోతున్నాను— అనుకొన్నదేమిటి? జరుగుతున్నదేమిటి? పాత్రలో తాదాత్మ్యమయిపోతున్నానా! అబ్బే ఇది మంచిదికాదు- నేను వట్టినే నటించాలి— మాడైరక్టరు అదే మాఆవిడ చెప్పిన విధంగానే నటించాలి... నా డైలాగులేవో గబగబా వల్లించేసి ఓవరేషను చేయకుండా నిష్క్రమించాలి. అంతే—

"సుందరీ...! నీ అధరామృతమివ్వవూ...! దగ్గిరికిరా... మొగుణ్ణి వదిలేసిన దానివి... నీకు సీతేమిటి? రా" అన్నాను. లేదు అందామని ప్రయత్నించాను ఎంతగానో. కాని ఒక్కమాటైనా బయటకు రాలేదు సరికదా, నోట్లోంచి 'గురగుర మని వింతశబ్దాలు మాత్రం వెలువడ్డాయి. మొదటిసారిగా స్టేజెక్కిన నటుడిలా చెప్పవలసిన డైలాగులన్నీ మరిచిపోయి, నటించడానికి బదులు చెమటలు కక్కుకొంటూ నిలువెలా వణికిపోతూ, డైలాగులు చెప్పడానికి బదులు, వింతవింత శబ్దాలుచేస్తూ, ఉన్నచోటనే ఉండిపోయాను!!

అతికష్టంమీద తలపైకెత్తి చూశాను—

సుందరి నావైపు వస్తోంది— కళ్ళల్లో కోపం మండుతోంది— 'అమ్మో...! నా వాలకం కనిపెట్టేసింది... ఆడబెబ్బులిలా ముందుకురుకుతోంది...! పంజా విసిరేస్తుంది సాచిపెట్టి లెంపకాయ కొట్టేస్తుంది. పోనీ పారిపోతే...

"ఏమిటండీ అలా వణికిపోతున్నారు...? ఏమయింది..." అంటూనే కళ్ళుతిరిగి వళ్లు వశంతప్పి ముందుకు పడబోతున్న నన్ను ఒడుపుగా పట్టుకొంది... నన్ను గట్టిగా పట్టుకోవటంకోసం బాగా దగ్గరిగా... వెచ్చగా... మెత్తగా నన్ను తాకుతున్న కుసుమ కోమల శరీరాన్ని అసంకల్పితంగా రెండు చేతులతో దగ్గరికి లాక్కున్నాను! 'మైగాడ్ ఏంచేస్తున్నాను నేను!' "అమ్మదొంగా! ఇదావేషం... ఛాపాడు... వంటిల్లే దొరికిందా ఈ కొంటె వేషాలు వేయడానికి...ఊ...సరే...లోపలికి పదండి...ఊ..."

అంతే! ఒక్కసారిగా నాకు పక్కలో బాంబు పడ్డట్టయింది. డొక్కలో నన్నెవరో ఫెడీమని తన్నినట్లయింది...! కాని... మనలోమాట; బూర్లెగంపలో పడ్డవాడు వెంటనే లేచి పారిపోగలడా?—

అంతే...! సుందరీ నేనూ లోపలికి నడిచాం...! అహ! అలా అనటంకన్న తనే నన్ను నడుంచుట్టూ చెయ్యివేసి వెచ్చగా, మెత్తగా తాకుతూ, లోపలిగదిలోకి నడిపించుకు వెళ్ళిందని చెప్పటం సమంజసంగా ఉంటుందిమరి!— అఘాయిత్యం జరిగిపోయినతర్వాత ఓ గంట తర్వాత మాత్రమే 'అరెరే! పాపం మా ఆవిడ' అన్నభావం మనసులో కలుక్కుమంది!

# దాచుకున్న...

## జీడిగుంట కామేశ్వరరావు

"మీ ప్రాణమిత్రుడు సువర్చలని పెళ్ళిచేసుకున్నాడుట! ఈ విషయం యింకా మీదాకా రాలేదా...?" అంది వసంత కాఫీ అందిస్తూ. తన గొంతులో వ్యంగ్యం ధ్వనించింది. అయినా అదేమీ పట్టనట్లు, అసలు తనన్నమాట నేను విననట్లే కాఫీ అందుకుని నెమ్మదిగా తాగసాగేను.

నా మౌనం అర్థంకాలేదేమో మరి— "నేనన్నది మీకు అసలు వినపడలేదా...?" అంది కొద్దిగా గొంతు హెచ్చించి. ఇంకా మాట్లాడకపోతే ఏమీ జరిగేదీ అనుభవమైనవాణ్ణి కనుక కాఫీ కప్పుని పక్కకి పెట్టి తనవైపు చూస్తూ "ఏమన్నావ్? మళ్ళీచెప్పు!"అన్నాను.

"ప్రసాద్ లేడూ— అతను ఆ కమ్మవారమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడుట వాళ్ళ నాన్నగారు అతనిమీద ఎగిరిపడుతున్నారుట. ఇందాక రమణి వచ్చినప్పుడు చెప్పిందీ విషయం!" అంది వసంత. నేను సీరియస్‌నెస్ నటిస్తూ విని "అయితే మా ప్రసాద్ పెళ్ళి చేసుకున్నాడంటావ్— అంతేనా? అదిసరే! అతనేం తప్పుచేశాడనీ అతనిమీద ఎగిరిపడుతున్నారు ఆయన?" అన్నాను— సీరియస్‌నెస్‌ని పక్కకి నెట్టివేసి, చిరునవ్వుని ముఖం మీదికి తెచ్చుకుంటూ. ఈమాటలనే సమయంలో అంతకుముందు వసంత గొంతులో ధ్వనించిన వ్యంగం నాకసలు గుర్తేరాలేదు. అందువల్లే 'ఏమిటీ? తప్పేమీ చేయలేదని అంటారా అతను?' అని వసంత అంటుంటే ముందు తెల్లబోయి, తర్వాత సర్దుకుని 'అది కాదోయ్ అతనికి ఆ అమ్మాయిపైన ప్రేమో, యిష్టమో, మరేదో వుండివుంటుంది. అందుకనే ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు..." అన్నాను— ప్రసాద్‌చేసిన పనిని సమర్థిస్తూ.

నా మాటలు పూర్తికాకముందే ఛర్రున లేచింది వసంత. 'అయితే యిదంతా మీరు చేసిందేనా? రమణి చెప్పినప్పుడే నేననుకున్నాను— మీ ఆధ్వర్యంలోనే యీ పెళ్ళి జరిగి వుంటుందని. అవునా?' అని కోపంగా అడిగింది నన్ను నిలదీసి.

ఈ ఆగ్రహానికి నేను ఆశ్చర్యపోయాను. నిజానికి నేను అభ్యుదయవాదినని వసంతకి తెలుసు. మా వీధిలోవున్న పెద్దవాళ్ళనెవరినైనా నాగురించి అడిగితే 'ఓ... ఆ వేణుగోపాల్‌గారా? ఆయన పక్కా అభ్యుదయవాది. మా వీధిలో వున్న కుర్రకారుని పోగుచేసి తన వుపన్యాసాలతో వాళ్ళని చెడగొట్టడమే ఆయన వృత్తి. అదే వుద్యోగం కాకపోయినా ఆయన వుద్దేశ్యంలో కులాలూ, మతాలూ మన పూర్వీకులెవరో ఏర్పరచారట. చతుర్వర్ణాలూ తానే సృష్టించానని గీతాకారుడన్నమాట ఆయన నమ్మడట. ఈ రెండూ సమాజానికి గొడ్డలిపెట్టువంటివనీ, అభ్యుదయానికి అడ్డుగోడలనీ అంటుంటాడు.

ప్రతీ యువకుడికీ తమ పెద్దలనెదిరించి యీ గోడలని ఛేదించమనీ— అంటే కులాంతర, మతాంతర వివాహాలు చేసుకోమని నూరిపోస్తుంటాడు. అంతే కాదండోయ్...! వరకట్నమన్నది సమాజ వ్యవస్థకి పట్టిన చీడపురుగట. స్వార్థపరులైన ఈ పెద్దలు తమ నీచ మనస్తత్వాలతో, దుష్టప్రయత్నాలతో యీ చీడపురుగుని పోషిస్తున్నారట. అతనికేమండీ! అయినింటి పిల్లని పెళ్ళిచేసుకుని హాయిగా వున్నాడు. కడుపునిండినవాడు ఎన్నైనా చెప్తాడుకదా! ఇక్కడున్న కుర్రకారుకీవిషయం అర్థంకాదు. అందులోనూ ఆ ప్రసాద్ అనే అతనికి ఈ వేణుగోపాలంటే మరీవెర్రి. చూస్తూండండి. చివరికి ఏ మాల పిల్లనో, క్రిస్టియన్ల అమ్మాయినో యిచ్చి ఆ ప్రసాద్ పెళ్లి జరిపిస్తాడితను!'' అంటూ 'ఆయన' అని ఆరంభించి 'అతను' అని ముగించటమూ, బహువచనంతో ఆరంభించి ఏకవచనంలోకి మారటమూ— నా చెవిన పడేట్లుగానే అనేవారు. అయినా నాతో మాట్లాడడానికి వచ్చే యువకులెవరూ యింతవరకూ ఆ విధంగా పెళ్ళి చేసుకోవటంవల్ల ఆ వీధిలో యింకా వుండగలిగాం. కానీ ఈరోజు ప్రసాద్ సువర్చలని పెళ్లిచేసుకోవటంతో మా వీధిలో యువకులకి చెప్తూవచ్చిన మాటలకి తొలిఫలితం కనిపించింది. దీనివలన నామీది విమర్శలు ఎక్కువ కావచ్చు. అయినా ఆ విమర్శలకి భయపడకుండా— ప్రసాద్ కోరితే అతడికి ఆశ్రయమివ్వడానికి తగిన ఆత్మస్థైర్యాన్ని కల్పించుకోవాలి.

'ఏమండీ! మాట్లాడరేం...?'' అన్న వసంత కేకలకి నా ఆలోచనలన్నీ పారిపోయాయి. వసంత అడిగిన ప్రశ్నని గుర్తుచేసుకుని ''ప్రసాద్ పెళ్ళి నా ఆధ్వర్యంలో మాత్రం జరగలేదు'' అన్నాను— అందుకు విచారిస్తున్నట్లు కంఠాన్ని ధ్వనింపచేస్తూ... విసురుగా అక్కడినుంచి వెళ్ళిపోయింది వసంత.

వసంత నా ఎదుటినుంచి వెళ్లిపోగానే పడక కుర్చీలోవాలి రెండేళ్ళక్రితం నేనడిగిన ప్రశ్నకి ప్రసాదిచ్చిన సమాధానం గుర్తుతెచ్చుకున్నాను. ఆరోజు ''చూడు వేణూ! మన మధ్యవున్న చనువువల్ల నువ్వీప్రశ్న అడగగలిగావు. ఒకవేళ నేను కనక కులాంతర వివాహమో, మతాంతర వివాహమో చేసుకున్నానంటే— మా నాన్న పరమ సనాతనాచార పరాయణుడని నీకూ తెలుసుగా— ఆ తరువాతి పరిస్థితులెలావుంటాయో ఆలోచించాలా వద్దా?'' అని ఒక నిముషమాగి ''అయినా- చూడువేణూ! నేను మరికొంతకాలంలో ఉద్యోగస్థుడిని కాబోతున్నాను. ఆ తరువాత కనక ఏ యితర కులానికి చెందిన అమ్మాయినో పెళ్లి చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడినా నేను వెనుకాడను. ఎటువంటి విమర్శలని ఎదుర్కోడానికైనా భయపడను. ఆ తరువాత నా తమ్ముళ్ళకో, చెల్లెళ్ళకో పెళ్ళి జరగదని ఎవరైనా అనవచ్చును. కానీ నా వివాహాన్ని హర్షించలేని వ్యక్తుల్ని నా తమ్ముళ్ళో, చెల్లెళ్ళో పెళ్లి చేసుకోవటాన్ని నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను. ఈనాడేకాదు- ఆనాడుకూడా...!'' అన్నాడు ఆవేశంగా. అతని ఆవేశానికి ఆరోజున అర్థం వూహించినా, నా వూహ కేవలం వూహేనేమోనని యీనాటివరకు అనుకుంటూ వచ్చాను. గత పదిరోజులుగా ప్రసాద్ మా యింటికి రాకపోవటమూ, నన్నుగానీ మా వీధిలోవున్న యితర మిత్రులనుగానీ కలవకపోవటమూ పెళ్లి ఏర్పాట్లలోపడి తీరికలేకుండా తిరిగివుండటమే అయివుంటుందనిపించింది.

నాతో తిరుగుతూండడంచేతనే ప్రసాద్ పెళ్లి చేసుకున్నాడనే అభిప్రాయం వాళ్ళ నాన్నగారిలో కలిగే వుంటుంది. ఆయన ప్రసాద్‌ని తన యింట్లో వుండనివ్వరన్న విషయం అబద్ధంకాదు. ప్రసాద్ తనభార్యని తీసుకుని ఎటువెళతాడు? 'ఇల్లు వెతుక్కునేవరకూ మా యింట్లో వుండ'మని చెప్పాలి. ఈ ఆలోచనరాగానే కుర్చీలోంచి లేచి బయటపడ్డాను.

బయటికి వచ్చిన తర్వాత "తన తండ్రి అంటున్న మాటలు వింటూ ఇంకా అతడు ఆ యింట్లోనే వుంటాడా...?" అన్న అనుమానం వచ్చింది. 'ఇప్పుడు ఏంచేద్దాం...?' అనుకుంటూండగా ఓ మిత్రుడు కనిపించి పలుకరించాడు. అతనితో మాటల్లోపడి ప్రసాద్ విషయం మర్చిపోయాను.

* * * *

"ప్రసాద్ పెళ్లి చేసుకుని పదిహేనురోజులు దాటినా యింతవరకూ అతను నాకు కనిపించలేదే! అతని తండ్రి అతణ్ణి యింట్లోకి రానివ్వలేదని విన్నాను. ఈ వీధిలో అతనికి నేనొక్కణ్ణే స్నేహితుణ్ణని చెప్పుకుంటాడే— మరి తన పెళ్ళయిన తర్వాత అసలు కన్పించనే లేదే!" అనుకుంటూ ఆఫీసుకి వెళదామని బయటపడ్డాను. అదే సమయంలో పోస్టుమాన్ ఎదురై యిచ్చిన వుత్తరాన్ని జేబులో పెట్టుకుని ఆఫీసు చేరుకున్నాను.

మధ్యాహ్నం లంచ్ టైంలో వుత్తరం విప్పి చదవసాగేను.

"వేణూ! నేను సువర్చలని పెళ్లిచేసుకున్న సంగతి సుమారు పదిహేనురోజుల క్రితం నువ్వు వినేవుంటావు. మా నాన్నగారు ఆ వివాహం కారణంగా నన్ను తమ యింట్లోకి అడుగుపెట్టనివ్వలేదు. ఆ పరిస్థితిలో నేను సువర్చలని వెంటపెట్టుకుని సరాసరి మీ యింటికే వచ్చాను. అప్పుడు నువ్వులేవు. మీ ఆవిడ నీ అభిప్రాయాలకి వ్యతిరేకంగా నిర్మొహమాటంగా— అన్నమాటలకి ఫలితంగా ఒక యిల్లు అద్దెకి తీసుకున్నాను. ఆ ఎడ్రెస్ కింద యిస్తున్నాను. నీకు వీలుంటే వుత్తరం వ్రాయి—ప్రసాద్..."అని వ్రాసి చిరునామా వ్రాశాడు.

"ఇదా జరిగిన సంగతి! వసంత నా అభిప్రాయాలనెప్పుడూ సమర్థించకపోవటం మామూలుగా జరుగుతున్నదేకానీ ప్రసాద్ నాకు ఆప్తమిత్రుడనే విషయం వసంతకితెలుసు కదా! ఎట్టి పరిస్థితులలోనైనా నా మిత్రుల్ని ఆదరిస్తుందన్న నా నమ్మకాన్ని ఎందుకు దెబ్బకొట్టింది?" అనుకుంటూ ఆఫీసులో వుండలేక యింటికి వెళ్లిపోయాను.

ఇల్లు చేరుకున్న తరువాత వసంతని అడిగాను- "ప్రసాద్ మన యింటికివస్తే రానివ్వలేదటకదా!" అని. నా ప్రశ్నకి వసంత యిచ్చిన సమాధానాన్ని సమీక్షించుకోగా "కులం తక్కువవాళ్ళని పెళ్ళిచేసుకున్నవాళ్లు ఈ ఇంట్లోకి అడుగుపెట్టటం నాకిష్టంలేదు" అన్న భావం స్ఫురించింది. వసంతని ఏమీ అనలేకపోయాను.

కొద్దిసేపు మిత్రుడికి సహాయం చేయలేకపోయిన స్థితికీ, వసంత అన్నమాటలకీ విచారించి, ఆ తర్వాత నా రీడింగ్‌రూమ్‌లోకి వెళ్ళాను. నా పాత డైరీలు వెతికి, నేను వసంతని వివాహం చేసుకున్న సంవత్సరపు డైరీనితీసి చదువుకోసాగాను.

'19-10-70

'వేణుబాబూ, మీరు వసంతని ప్రేమిస్తున్నాననీ, పెళ్ళిచేసుకుంటాననీ అంటున్నారు కానీ వసంత నా కన్నబిడ్డకాదు. ఇరవై రెండు సంవత్స రాల క్రితం నేనూ, నా భార్యా సంతానాపేక్షతో తీర్థయాత్రలకి బయలుదేరి రెండు సంవత్సరాలపాటు అన్ని తీర్థాలూ దర్శించాం. చిట్టచివరగా సింహా చలం వెళ్లి తిరిగివస్తుండగా మాకు ఒక పాప దొరికింది. ఆ నెలరోజుల పాప ఎవరిపిల్ల అనే విషయం తెలుసుకుందామని అనుకున్నా ఆ పరిసరాల్లో వున్నవారెవరూ మా ప్రశ్నల్ని పట్టించుకోలేదు. ఆ పసిపాపని దైవప్రసాద మని భావించి మా యింటికి తెచ్చుకున్నాం. నాభార్య సహకారంతో ఆ పసి పాపని మా పిల్లగా లోకానికి పరిచయంచేసి నమ్మించగలిగాను...'అన్నారు రాజారావుగారు. కొద్దిసేపటి తర్వాత 'ఈ విషయం చివరికి వసంతకికూడా తెలియదు. అయినా వసంతని ప్రేమించాననీ, పెళ్ళిచేసుకుంటాననీ నువ్వు అంటున్నావు. అందుకే యీవిషయం చెప్తున్నాను. మీ తండ్రి పూర్వాచారా లని నిష్టగా అవలంబించే వ్యక్తి అని విన్నాను. మీవివాహం జరిగిన తర్వాత వసంత విషయం మీ తండ్రికి తెలిస్తే కష్టం...' అని యింకా ఏదో అన బోతుండగా, 'చూడండి రాజారావుగారూ! నేను వసంతని ఆమె కులంచూసి ప్రేమించలేదు. ఆమెతో నా మూడేళ్ళ పరిచయం తర్వాత నేను యీమాట లనటం ఆశ్చర్యకరంకాదేమో! పైగా వసంతకికూడా తెలియని విషయం కనుక— మీరో, నేనో చెప్తేతప్ప మా నాన్నగారికి యీ విషయం తెలి యదుకదా! మీరు సందేహించనవసరంలేదు...' అన్నాను. 'కానీ...' 'అంతేకాదు రాజారావుగారూ! మీరు వసంతని ఇరవై ఏళ్ళపాటు పెంచగలిగినప్పుడు, మిగిలిన జీవితకాలం ఆమె నాతో గడపడాన్ని నేను భరించలేనా?' అనేసి ఆయన్ని ఒప్పించగలిగాను.''

డైరీమూసి టేబుల్‌మీద పడేసి ప్రసాద్‌కి శుభాకాంక్షల వుత్తరం వ్రాస్తూ వసంత ప్రవర్తనకి బాధపడుతున్నాననికూడా వ్రాశాను.

నేను వుత్తరం రాసిన తర్వాతి ఆదివారం ప్రసాదూ, సువర్చలా మా యింటికి వచ్చారు. లోపల్నించి వసంతవచ్చి వాళ్ళని సాదరంగా ఆహ్వానించడంతో నేను ఆశ్చర్య పోయాను. ఆ తర్వాతకూడా వాళ్ళకి వసంతచేస్తున్న మర్యాదకి నాకు మరింత ఆశ్చర్యం కలిగింది. ఆ దంపతులు వెళ్లిపోయాక వసంతని అడిగాను. 'ఆరోజున నాతో నువ్వన్న మాటలకీ, ఈరోజున నువ్వుచేసిన మర్యాదకీ ఎక్కడా సామ్యంలేదే! ఏమిటీ విశేషం?'' అని వసంత అక్కడినించి వెళ్లిపోయింది. ''ఆరోజు మీరు వుత్తరం పోస్టుచెయ్యడానికి వెళ్లిన విషయం తెలియక భోజనానికి రమ్మని పిలవటానికి రీడింగురూమ్‌లోకి వెళ్ళి, క్యూరియాసిటీతో అక్కడే టేబిల్‌మీద వున్న డైరీని చదివాను...' అన్న మాటలు గోడదాటి నా చెవుల్లో పడ్డాయి. నేను శిలాప్రతిమలా నిల్చుండిపోయాను.

# ముగింపు

ఎమ్. రత్నమాల

మనసంతా చిరాగ్గాఉంది. ఎంత మర్చిపోదామన్నా ఉదయం జరిగిన సంఘటనే. మనసులో మెదులుతోంది. ఇంత జరిగాక ఏమొహం పెట్టుకొని ఇంటికి వెళ్ళటం.

ఛీః పాడుబ్రతుకు. ఇలాంటి బ్రతుకు బ్రతికేకంటె చావటం నయం. దినదినగండం నూరేళ్ళాయుస్సని నామీదా చావుక్కూడా కనికరంలేదు.

క్షణక్షణం చస్తూ అనుక్షణం నరకాన్ననుభవిస్తూ బ్రతికేకంటె చావు సర్వవిధాలా నయంకదూః అవును చావే నాకు శరణ్యం. అదే అన్ని సమస్యలకి పరిష్కారం.

ఐనా చచ్చిసాధించేదేముంది ? లేకపోవచ్చుకాని ఈ బాధల్నుండి విముక్తి పొంద డానికి ఇంతకంటె మరోమార్గంలేదు. ఈ కల్లోలాన్ని గుండెలో దాచుకొనే శక్తి నాకులేదు. క్షణమైనా మనశ్శాంతి లేకుండా జీవించడం నా తరంకాదు.

నాకు శాంతికావాలి అనంతమైనశాంతి అంతులేనంత శాంతి.

జీవితాన్నుండి పారిపోయి మృత్యుముఖంలో తలదాచుకుంటే తప్ప బ్రతికుండగా శాంతి లభిస్తుందనుకోవడం అత్యాశ. గత్యంతరంలేదు.

మరో అవమానం జరక్కముందే మరికొంత ఆవేదన మిగలకముందే జీవితం ముగించుకోవాలి.

ఛాః ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటెనక చావన్నట్టు చివరికి ఆత్మహత్య అసమర్థతకి చాతగానితనానికీ శాశ్వతమైన చివరి నిదర్శనం. ఎందరెన్నిరకాలుగా ఊహించుకుంటారుః

ఓ నల్లకళ్ళద్దాల యువకుడు స్టయిల్‌గా నడవబోయి డ్యానిచ్చి తేరుకొని తిట్టే లోపల కంగారుగా వెళ్ళి పోయాడు.

తూలి పడబోయి నిలదొక్కుకున్నానుకాని అసలు అంతంతమాత్రంగా ఉన్న చెప్పు కాస్తా పూర్తిగా తెగింది. నాలుగడుగుల దూరంలో ఫుట్‌పాత్‌పై వో ముసలాడు చెప్పులు కుడుతున్నాడు. తెగిన చెప్పుతో ఎలాగో కాళ్ళీడ్చుకుంటూ అందాకా వెళ్ళాను. అక్కడో క్యూలా ఐదారుగురు వరుసగా ఉన్నారు. ముందు డబ్బులు చూసుకోవాలిగాః 10 పైసలన్నా దొరక్కపోతాయాః అంతా వెదికాను. ఐదుపైసలుమాత్రం దొరికాయి. అక్కడినుంచి కదిలాను.

వీటిని మోసుకుపోవటం ఎలాః పిన్ను పెట్టడానికి ప్రయత్నించాను. ఇంకా స్త్ర తెగిందేతప్ప లాభం లేకపోయింది

నిజానికి ఈ చెప్పుల్ని ఎప్పుడో పడేయాల్సింది. వేరేగతిలేక వీటితో గడిపివేయటం తప్ప.

ఎందుకూ పనికిరాని వీటిని ఇంటిదాకా మోసుకుపోవటం దండుగ. అనవసరంగా వీటిని అంతదూరం మోసుకుపోతే ఏం ప్రయోజనం. ఇక్కడే వదిలేస్తేసరి.

మరి నావల్లకూడా వీసమెత్తు ప్రయోజనం లేకపోగా అందరికీ లేనిపోని భారంగా ఉన్నానుకదా.

దూరాన్నుండి రైలొస్తోంది కాబోలు అంతకంతకూ రైలుశబ్దం పెద్దదవుతోంది.

నిశ్శబ్దంగా వ్యాపిస్తున్న చీకటి వెలుగును మింగేస్తోంది. స్టేషన్‌ని సమీపిస్తూనే రైలుశబ్దం పెద్దదవుతోంది.

ఇళ్ళకు చేరే జనంతో వాహనాలతో రోడ్డు రద్దీగా నా మనస్సుమాదిరే గజిబిజిగా ఉంది

సామాన్యంగా ఎంతదూరంలో ఉన్నా అందరూ ఇళ్ళకి చేరుకునేవేళ. కానీ నాకా మాట గుర్తుచేసుకుంటేనే అంతులేని నిరాశా, నిస్పృహా ఆవరిస్తోంది.

దూరాన్ని తాగుతూ పొగల్ని క్రక్కుతూ రైలువేగంగా వస్తోంది.

ఇంత మొండిగా బ్రతికే ధైర్యం నాకులేదు. రైలుపట్టాలవైపు గబగబా నడిచాను నడిచేందుకూడా ఓపిక లేకుండా ఉన్నవాళ్ళకి ఇంత సత్తువ ఎక్కడిదో? ఏమో! ఆరిపోయేముందు దీపం మరింత వెలుగుతుందట. నిజమేమో!

పట్టాలకీ నాకూ మధ్య తగ్గిపోతోన్న దూరం బ్రతుక్కీ నాకూ మధ్యవున్న దూరాన్ని పెంచుతోంది.

రైలు వచ్చేస్తోంది త్వరగా పరిగెత్తాలి. అబ్బా ఇంతచిన్న రాయి తగిలితేనే ఇంత నొప్పిగా ఉంది. పరుగెత్తడం ఎలా? అయినా చావడానికే సిద్ధపడి ఇంతచిన్న దెబ్బకి వెఱవడమా.

అరె రైలు వచ్చేస్తోంది. త్వరగా పరుగెత్తాలి. అబ్బా! కాలునొప్పి. కర్మకాకపోతే ఇప్పుడే కాలుకి దెబ్బతగలాలా!

అయినా వోర్చుకోవాలి. ఇంకో నాలుగడుగులైతే ఏ బాధా ఉండదు త్వరపడాలి... ఇక్కడా ఓటమి తప్పలేదు. ఈ అదృష్టంకూడా అరక్షణంలో చేజారిపోయింది.

రైలు వెళ్లిపోయింది. చివరికి మృత్యువుకూడా మోసగించింది.

ఐనా ఈ రైలు తప్పితే మరోటిలేదా. ఏదిఏమైనా ఈ నిర్ణయం మాత్రం మార్చుకునేదిలేదు.

మరోరైలు వచ్చేవరకు చాలాసేపవుతుందేమో. అంతవరకు ఇక్కడే ఉంటే కొంప దీసి ఎవరైనా మాని అనుమానిస్తే నా ప్లాన్‌కాస్తా పాడయిపోతుంది.

హూ... బ్రతికుండి క్షణానికో సారి చస్తూవుంటే ఒక్కరూ సానుభూతీ, సహాయం అందించరుకాని, చచ్చేవాళ్ళ దగ్గర అందరూ తగుదునమ్మా! అని తయారవుతారు నీతులు చెప్పడానికి.

అయినా నా పిచ్చిగాని చచ్చేందుకు రైలుకిందే పడాలని ఏముంది...? మనసుంటే మార్గం ఉండకపోదని మరెన్ని మార్గాలులేవు అందుకు.

"మూడ్రోజుల్నుంచి ఉపాసం. ధర్మంచేసి పుణ్యం కట్టుకోండి ధర్మాత్ములు...' కర్మ! వీడెవడో నాకంటె దౌర్భాగ్యపు మొండిఘటం. వదిలేట్టులేడు.

కుష్టువ్యాధేమో వ్రేళ్లుతెగిన చేతులు ఇంకా చాలా అచ్చంగా వర్ణించి చెప్పితే వినడానికే అసహ్యం ఉంది వాడి రూపం. అక్కడో క్షణంకూడా నిలవబుద్ధికాలేదు. ప్రొద్దంతా అరచినా అర్ధాకలితీరదు. వాడు బ్రతికుండగా వాడి బ్రతుకులో మార్పు ఇప్పటికేకాదు ఎప్పటికైనా ఏవిధమైన మార్పు వస్తుందన్న ఆశ వాడికూ్కడా లేదు.

అయినా వాడు జీవిస్తున్నాడు ఎందుకు?

ఏమో! అంతర్యాలు అంతుచిక్కనివి. ఓసారి వెనక్కి తిరిగి చూడాలనుకుని ఆ ప్రయత్నం అప్రయత్నంగానే విరమించుకున్నాను.

వాడిముందు నేను కుంచించుకుపోయి నాకునేనే మరుగుజ్జులా అన్పించసాగాను. నాలోని విరికితనానికి వాడు భూతద్దం అనిపించింది. మాటిమాటికి వాడి జుగుప్సాకరమైన రూపం కళ్ళలో కదులుతోంది. అర్థంలేని ఆలోచనలతో మనసు గందరగోళంగా ఉంది.

ఉలికిపడి ప్రక్కకు గంతేసాను. డ్రైవర్ తిడుతూ బస్సు మళ్ళీ స్టార్ట్‌చేశాడు.

నాలోనేనే నవ్వుకున్నాను. ఇంతక్రితమే చావడానికి సిద్ధపడి బస్సు మీదకొస్తే ఎందుకంత గాబరాపడ్డాను.

నాకు నిజంగా చావాలని లేదేమో. అంతర్గతంగా ఏమూలో బ్రతుకంటే ఆశ దాగి ఉందేమో! ఉహు కాదు నాకు బ్రతకాలని లేదు.

మరి ఇందాక అలా—

బహుశా అది అప్రయత్నంగా జరిగిందేమో!

అవును అంతే అయ్యుంటుంది.

చిరపరిచితమైన గొంతువిని తలెత్తిచూసాను. ఇందాకటినుండి గమనించనేలేదు. అటూఇటూ తిరిగి చివరికి మా వీధికే వచ్చేశాను.

రాగిణి మా వీధి చివరింటి వాళ్ళమ్మాయి కూరలు బేరంచేస్తోంది. అందరూ ఆమె గురించి చాలా చెడ్డగా చెప్పుకుంటారు కాని నా దృష్టిలో ఆమె ఏ మాలిన్యం అంటని మల్లిక. తానుకరుగుతూ వెలుగును పంచే క్రొవ్వొత్తి.

ఎదురుగా ఉన్న కిరాణా కొట్లో వెలిగించిన క్రొవ్వొత్తి, చివరిబొట్టువరకు కరిగి ఆరిపోవడానికి సిద్ధంగా ఉంది. ఆరేముందు దాన్తోనే మరోరెండు వెలిగించిపెట్టాడు కొట్టువాడు.

నా కనుకొలుకుల్లో రెండేరెండు కన్నీటిబొట్లు ఇంకిపొయ్యాయి.

రాగిణి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

క్రొవ్వొత్తి పూర్తిగా ఆరిపోయింది.

మనసు బాధగా బరువుగా నిట్టూర్చింది. నా కాళ్ళక్రింద భూమి కదిలి పాతాళానికి క్రుంగిపోతున్నట్టనిపించసాగింది.

నెమ్మదిగా నడక సాగించాను. అనుకున్న ప్రకారం జరిగితే ఈపాటికి నేను హాయిగా శాశ్వతంగా—

ఏమో అలా జరగాలనేముంది. మరోలా జరిగితే చావుతప్పి కన్ను లొట్టపోయిందన్న సామెతలా.

అమ్మో ఇంకేవన్నా ఉందా శరీరం జలదరించింది. ఏదన్నా జరిగి బ్రతికి బయట పడితే ఎంత దుర్భరం అవుతుంది జీవితం.

చావు పుట్టుకలకి మన ఇష్టాలతో ప్రమేయంలేదు. పుట్టటం మన ఇష్టప్రకారం జరుగుతుందా మరి, జీవితానికి ముగింపు మనమే నిర్ణయించుకోవడానికి. ఈ జగన్నాటకంలో మన పాత్రకి ముగింపు ఎప్పుడో— అప్పటిదాకా ఎంత భారమైనా దూరమైనా ఇష్టమున్నా లేకపోయినా మనపాత్ర మనం నిర్వహించక తప్పదేమో. ముగింపు ఎప్పుడో చివరి క్షణంవరకు తెలియదు. ఎలా మొదలిడి ఎలా ముగుస్తుందో అంతకంటె అంతు దొరకదు.

నవ్వొచ్చింది చివరికి వేదాంతంలో పడ్డానేమిటా అని. వేదాంతమైనా మరేదైనా వాస్తవం ఇదేకదా.

''ఏం? ఇప్పటికి తీరిందా ఇందాకా ఎక్కడెక్కడ పెత్తనాలు వెలగబెట్టి వస్తున్నావు.'' గడపలోనే అందుకుంది అమ్మ.

''కొంచెం ఆలస్యం...'' మాట పూర్తి చెయ్యలేకపోయ్యాను. అప్పటికే ఉదయం 8-30 గంటల నుండి వచ్చే పాటలు అయిపోవస్తున్నాయి.

''బ్రతుకే ఒక బందిఖానా భయపడి తెంచుకు పారిపోయినా తెలియని పాశం వెంట పడి రుణం తీర్చుకోమంటుంది.'' అవునేమో— ఒక్కోసారి మనం దేనిగురించి ఆలోచిస్తూంటామో అదే విషయం విన్పిస్తూ కన్పిస్తూ ఉంటుంది. లేక మనమే అలా అన్వయించుకుంటామో ఏమో!

# జీవితంలో ఓ భాగం

విశ్వనాథ సూర్యనారాయణ

మళ్ళీ కళ్యాణి కనిపించింది. ఈమారెందుకో పిలవలేదు. చిర్నవ్వునవ్వి ఊరుకుంది. అసలు టైముకూడా లేదు. నేనిటుపక్క బస్సెక్కడానికి సిద్ధంగా ఉన్నాను. అటుపక్క బస్సుకోసం నిలబడింది కల్యాణి. మామూలుగా అయితే వెళ్ళేవాణ్ణే! కాని ఇవాళ ఎందుకో అనీజీగా వుంది.

మొన్నటికిమొన్న అప్పటికే ఆలస్యం అయిందని ఇంటికిపోయే తొందరలో గబగబా నడుస్తుంటే ఎవరో కుర్రాడు నా ఫేంటు పట్టుకులాగాడు. నేను చిర్రుమని చూసాను. వాడి మొహంచూసి ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఆగాను. వెనక నుండి నవ్వులు... అడవి మల్లెలు పూచినట్లు, ఆకాశం విరిసినట్లు. కల్యాణి! చేతులో ఏవో పాకెట్లు పట్టుకుని కుర్రాడు నా చెయ్యి పట్టుకున్నాడు. నన్ను నడిపించి తీసుకెళ్తున్నట్లు ఫీలయాను. 'ఏరా బాబిగా! మావయ్యను లాక్కొచ్చావా?' అప్పటికి నాకు స్ఫురణ కొచ్చింది ఈ బాబిగాడెవడో! సంవత్సరంక్రితం చూశాను. అంచేత గుర్తుపట్టలేకపోయాను. 'హల్లో! సూర్యం మావాడు నిన్ను బాగా పట్టేడే! అన్నాడు శ్రీధర్ నవ్వుతూ.

'ఏం ఫ్రెండువోయ్ సూర్యం? ఊళ్ళో ఉండీకూడా ఇన్నాళ్ళపాటు కలవకుండా ఉన్నావంటే నీ నిగ్రహశక్తి మెచ్చుకోదగిందే! ఈమధ్య ఆసనాలుగట్రా వేస్తున్నావేంటి కొంపతీసి!' నవ్వుతూనే అంది కళ్యాణి. 'దాని నిగ్రహశక్తి కూడా నువ్వు మెచ్చుకోవాలి! వారందాటితే పుట్టింట్లోనే వుంటుంది. ఏం అదృష్టం చేసుకుందో మీ స్నేహితురాలు! ఉన్నూళ్ళో మొగుణ్ణి సంపాదించుకుంది.'

'చాల్లెద్దురూ! నిజమేననుకోగలడు సూర్యం!' సిగ్గుపడింది కల్యాణి. అప్పుడే చీకటి పడుతోంది, కాటుక వర్షం పడుతున్నట్లు 'అన్నట్లు. అసలు విషయం మర్చిపోయాను. రేపు మా బాబిగాడి బర్త్‌డే! అందుకే షాపింగ్‌కొచ్చాం! కాస్త ఇంటికి రాకూడదూ? డికొరేషన్‌లో హెల్ప్‌చేద్దువుగాని!'

'నీ ఆహ్వానం బావుంది. రేపు రమ్మనమని చెప్పడం మానేసి ఇప్పుడు రమ్మంటావేం? ఇప్పుడు వచ్చినా రాకపోయినా, సూర్యం రేపు సాయంత్రం తప్పకుండా రావాలి మేక్‌షూర్ యువర్ ప్రోగ్రామ్ టుమారో.'

కళ్యాణి మాత్రం ఊరుకోలేదు రానని చెప్తే! వచ్చితీరాలి చచ్చితీరాలన్నది. రెండో మాట కల్యాణనలేదు. నేననుకున్నది. టాక్సీని పిలిచాడు శ్రీధర్! ముగ్గురం టాక్సీఎక్కాం నేను గడ్డంమీద చెయ్యివేసిన తర్వాత తెలిసింది. నేను గడ్డం గీసుకొని సుమారు వారం అయుంటుందని. కొద్దిగా భయపడ్డాను. మరేంలేదు, ఈ అవతారంచూసి కళ్యాణి ఏమీ

అనుకోదుకదా అని. బాబిగాడు కళ్యాణి ఒళ్ళోంచి నా ఒళ్ళోకి పాకాడు. నా గడ్డం నిమిరాడు. 'వేమన అనుకుంటున్నావేమిట్రా' అంది కళ్యాణి నవ్వాపుకుంటూ. అలాంటిమాటలంటేనే నాకోపం వచ్చేది. వేమనంటే వాడికి తెలీదనీతెలుసు. నాకు తెలుసుననీ తెలుసు. ఇదంతా నన్నేడిపించడానికేనా. శ్రీధర్ మాత్రం నవ్వేడుగాని నాక్కనపడనివ్వలేదు. నేనేమైనా అనుకుంటానని కాబోలు. కళ్యాణికి మాత్రం అలాంటివేంలేవు. బాబిగాడు సరేసరి వాడే విష్టేసినట్లు నవ్వేస్తున్నాడు. శ్రీధర్ నవ్వుల్ని బ్రేక్ చేస్తూ 'అవును కళ్యాణి అడిగినట్లు ఇన్నాళ్ల ఏమైపోయావ్?' ఆమాట నాకు వినపడలేదని చెప్దామనుకున్నాను.'' కనీసం విననట్టు రోడ్డువైపుచూస్తూ ఉండిపోదామనుకున్నాను. 'కూతరు కూతరు' అని బాబిగాడు కిటికీలోంచి చూస్తూ అరుస్తున్నాడు. అటుచూసేను. స్కూటర్ మీద జంట స్కేటింగ్ చేస్తున్నట్లు జారిపోతున్నారు. వాళ్లు నవ్వుతున్నారు. నన్ను చూసేనా? ఛీఛీ! నన్నుచూసి ఎందుకు? "ప్రశ్నకి సమాధానం ఏదోయ్" కళ్యాణి కంఠం. 'కవిత్వం రాస్తున్నావా?'' అదుగో! మళ్ళీ అలాంటి మాటలే! ''ఏంలేదు. మా ఆఫీసర్‌తో కేంప్‌కి వెళ్ళవలసి వచ్చింది'' అని ఊరుకున్నాను. బయటికి చూడ్డం మాత్రం మానలేదు. కార్లు, బస్సులు, రిక్షాలు, ట్రాఫిక్ రొద బాగావుంది. ఆటోమోబైల్ ఎవడు కనిపెట్టాడోగాని—

''మీ చెల్లి చెప్పింది లేవోయ్ మహా! నీ సంగతులన్నీ! కావాలని కేంప్ వేయించుకున్నావట! సంపాదన బావుందా?'' అదోరకంగా నవ్వింది. ఎన్ని రకాలుగా నవ్వగలదు కళ్యాణి? మాట్లాడకుండా నవ్వులోనే భావాన్ని బయటపెట్టేస్తుంది. నేను కేంప్ వేయించుకునేది పై సంపాదనకని వీళ్ళ దృష్టి. ప్చ్! అమ్మా, సరోజాకూడా ఇలాగే అనుకుంటున్నారా? ఛ! ఛ! అంతగా కావాలంటే సరయిన మార్గాలు చాలా వున్నాయ్! ఈమనుషుల్ని ఈవాతావరణాన్ని తప్పించుకుందామని, ముఖ్యంగా కళ్యాణిని, కేంపుకెళుతున్నాడుగాని-

''ఏం అలా కోపంగా చూస్తావ్! తప్పేం చెయ్యడంలేదుగా! తల్లి, చెల్లి, రేపొద్దున పెళ్ళాం పిల్లలూ వీళ్ళకోసమేగా నీ సంపాదన. ఎటొచ్చీ అడ్డుదారనిగాని, అదైనా ఫరవాలేదులే! మితిమీరితేనే ఇబ్బంది."

"కళ్యాణీ! తెలిసి మాట్లాడుతున్నావా? తెలీక మాట్లాడుతున్నావా?" ఎంత సౌమ్యంగా అందామన్నా నోరు చిన్నగా రాలేదు.

'ఎందుకంత ఆవేశం సూర్యం అసలు...'

'డ్రాప్‌ది మాటర్ ప్లీజ్' శ్రీధర్ కలుగజేసుకున్నాడు. ఇంతలో టాక్సీ ఆగింది. అందరం దిగాం. బాబిగాడు నా భుజంపైన నిద్రపోయాడు. ఇంట్లోకి వెళ్ళాక కళ్యాణికిచ్చాను బాడిగాడిని. ఆ తరవాత చాలాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ, రంగు కాగితాలు అంటించడం, బల్బులు, బుడగలు వేలాడదీయడం, మొదలైనవి చలాచేశాం నేను శ్రీధర్. ముగించినట్లనిపించి, చేతులూ ముఖం కడుక్కుని, ఈజీ ఛెయిర్‌లో కూర్చున్నాను శ్రీధర్ నేను ఉద్యోగంలో ఎక్కబోయే మెట్లగురించి మాట్లాడుతున్నాడు నేనేదో సమాధానం చెబుతున్నాను.

'కష్టపడ్డావ్, కాఫీ తీసుకో' కళ్యాణి.

'కాఫీకోసం కష్టపడ్డాననుకుంటున్నావా?' కళ్యాణిని ఏదో అనాలి, ఏడిపించాలి అన్న తపన ఏదో వాగిస్తోంది నాచేత.

'కసురుకుంటావేం?' మళ్లీ కళ్యాణి. సానుభూతిగా.

'అయినా ఇప్పుడెందుకు? నేనింటికెళ్ళి భోజనంచెయ్యాలి' ముందుమాటలోని విసుగు పోయింది. కావాలని అలిగినట్లుంది. ఇలా క్షణక్షణానికీ మారిపోతాడేంటి తను.

'మేం మటుకు ఉపోషం అనుకున్నావా? నిక్షేపంలా భోజనం చేస్తాం. అయినా కాఫీకి ఇంత రాద్ధాంతం ఏమిటి? దీనికితోడు టిఫిన్‌కూడా ఇమ్మన్నారు ఆయనగారు!' అని ఇద్దరికీ కాఫీ పెట్టేసి వెళ్ళిపోయింది.

అంటే శ్రీధర్ స్నేహానికిచ్చిన విలువ కల్యాణి తన ప్రేమకివ్వలేదన్నమాట. టిఫిన్ ఇవ్వమని చెప్పటం స్నేహమూ, టిఫిన్ ఇవ్వకపోవడం ప్రేమలేకపోవడమూ క్రింద జమా? ఏమో! ఈ విషయం తను ఆలోచించలేదు. 'వస్తాను' కాఫీతాగి లేచాను. ఎవర్నుద్దేశించీ అన్లేదు. ఆఫీసుకెళ్ళగానే ఆఫీసరు కనిపిస్తే గుడ్‌మార్నింగ్ చెప్పినట్లుంది. 'ఊ' ఇద్దరి నోటిలోంచి ఒక్కసారే వచ్చింది. వీధిలోకి వచ్చి వాచీవైపు చూశాను. రెండు మిణుగురు పురుగులు అంకెల్తో ఆడుకుంటున్నట్లున్నాయి ముళ్లు. ఎనిమిదిన్నరయింది. ఇంటికి చేరేసరికి (బస్సులు దొరికి) తొమ్మిదిన్నర.

కల్యాణి బస్సెక్కి వెళ్ళిపోయింది... నా ఆలోచన అక్కడ తెగిపోయింది. 'టింగ్ టింగ్' మనగానే నా బస్సు కదిలింది. అరె! ఇంతసేపూ ఇక్కడేవుండి కల్యాణి గురించి ఆలోచిస్తున్నానా? అబ్బ తలనొప్పిగా వుంది.

ఆరోజూ అంతే తలనొప్పిగా వుందని క్రికెట్‌నుంచి తొందరగా వచ్చేస్తున్నాను. మా ఇంటిమేడ గోడకానుకొని ఓ అమ్మాయి నిల్చునివుంది ఏదో కూనిరాగం తీస్తూ. నన్నుచూసింది కాబోలు. ఆపేసి అటువైపు తిరిగిపోయింది. ఆ ముఖం ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం. ఇలా అనుకుంటూ ఇంట్లోకి అడుగుపెట్టాను. మా సరోజ మేడ మీదకి పరుగుతీస్తున్నదల్లా, నన్నుచూసి 'ఇలా ఓసారి మేడమీదకి రా అన్నయ్యా, అంది. మేడ మీదకు వెళ్ళాను.

'ఈ అమ్మాయే నన్నయ్యా! కళ్యాణి! మీకాలేజీలోనే పి. యు. సి చదువుతోంది'.

'నమస్తే' నాజూగ్గా ఉన్నాయామాటలు.

'మిమ్మల్ని చాలాసార్లు కాలేజిలో చూసానులెండి! మీరూమ్‌పక్కగానే మారూమ్'

'అంటే నేనెవరో మీకు తెలుసన్నమాట' క్యూరియాసిటీ కొద్దీఅడిగాను. కాలేజీ మెట్లు ఎక్కగానే ఈ 'మీరు' పదం అంటుగుంటుంది. ఇదోదురలవాటు.

'మీరు సూర్యమనీ, క్లాసుఫస్టువస్తారనీ, కాలేజీమెట్లుతప్ప మేడచూడరనీ, ఇంకా చాలా చాలాతెలుసు'. నాకునిజంగా ఆశ్చర్యం వేసింది. ఈ అమ్మాయి కాలేజీలోచేరి ఆర్నెల్లవుతుంది. ఇంతలో ఇంత ఇన్ఫర్మేషన్ ఎలాసంపాదించిందబ్బా? నేనునిజంగా గొప్పవాణ్ణేమోనని అనుకున్నాను. కొద్దిగా గర్వం ఫీలయాను.

కాఫీ చల్లారిపోతుందన్నయ్యా' ఉలిక్కిపడ్డాను. తలనొప్పి ! ఇటూఅటూ చూసాను. కల్యాణికాదు. సరోజ. మేడకాదు ఇంట్లోనే; ఈజీఛెయిర్. పాతరీలు కళ్ళముందు తిరిగిందంతే !

చివరకు కల్యాణి ఉపకారమేచేసిందో, అపకారమేచేసిందో తేల్చుకోలేక పోతున్నాడు తను. పుస్తకాలు చదవడం నేర్పింది, మాట్లాడడం నేర్పింది, ప్రేమంటేఏమిటో చెప్పింది. మనిషికీ, మనసుకీ అనుబంధం విడమర్చింది. నాకు తెలియనివి, కల్యాణికి తెలిసినవి ఇన్ని ఉన్నాయా అనిపించేది ! ఒకొక్కసారి మాట్లాడుతూంటే విస్తుపోతూ చూడ్డం తప్ప ఏం చెయ్యలేకపోయేవాణ్ణి. ప్రేమించింది, ప్రేమనందుకో కుండానే వెళ్ళిపోయింది. కల్యాణి ! జీవితం అంటే ఏమిటో తెలియజెప్పి ఉపకారం చేసిందా ? ప్రేమంటే బాధే అన్నట్లుచేసి, అపకారం చేసిందా ! ఇప్పటికీ నాకు సందిగ్ధంగానేవుంది. ఆలోచన తెగలేదు. తలనొప్పి తగ్గలేదు.

తలనొప్పి, ఎప్పుడూ కల్యాణిపెళ్ళిజ్ఞాపకం తెస్తుంది. ఇదే, ఇలాగేతలనొప్పి. ఆ రోజు సరోజతో ఎన్నికబుర్లు పెట్టిందో ? తనుఊళ్ళో ఉండకూడదనుకున్నాడు. ఊళ్ళో ఉండక ? అప్పటికి ఉద్యోగవూలేదు. ఏసాకుతో ఏవూరు వెళ్ళను?

పెళ్ళిహడావుడి అంతా మాఇంట్లోనేవుంది. సరోజయితే చెప్పక్కరలేదు పెండ్యులంలా వాళ్ళింటికీ మా ఇంటికీ తిరుగుతోంది. బాజాలు చెవుల్లో పడుతూనే వున్నాయి. పెళ్ళివాసన వీస్తునేవుంది. నేనూ తలనొప్పీ మేడమీద కూర్చున్నాం. అప్పుడప్పుడు కొన్ని జతల కళ్లుతొంగి చూస్తున్నాయి కల్యాణి కళ్ళముందు కదుల్తోంది, పెళ్ళికూతురు వేషంలో.అది వేషమేనని అనుకుందామనుకున్నాను. కాలేజీ ఏనివెర్సరీకి ఫాన్సీడ్రెస్ వేసిందనుకుందామనుకున్నాను. కాని ఎలా ? వారం రోజులక్రితం చేతికందించిన శుభలేఖను చూసిననేను, ఇది పెళ్ళికాదని ఎలా నమ్మను ?

పెళ్ళి పందిట్లోకి వెళ్ళాను. ఆ పెళ్ళికొడుకు మారువేషంలో రాజకుమారినెత్తుకుపోవడానికొచ్చిన రాక్షసుడిలా కనపడ్డాడు. ఆ పురోహితుడూ అంతే. వాడి బంటు. ఆగొంతు ఎంత భీకరంగా ఉందో! కల్యాణి మాత్రం సిగ్గుతో నవ్వుతోంది, తలవంచుకొని ఇది కూడా మాయా కల్యాణేననిపించింది. సరోజనేనొచ్చినట్లు చెవులోవూదింది కాబోలు! బరువుగా తలెత్తి చూసింది. మొగలిరేకులతో కుట్టిన జడ, సిగ్గుబుగ్గల్ని పట్టుకుని కిందికి లాగుతూంటే తేల్గిగా ఎలా చూడగలుగుతుంది? చిన్నగా నవ్వింది. 'నవ్వెందుకు? తన్ని చూసి నవ్వాలా? అయినా అసలు ఎలా నవ్వగలిగింది? ఇలాంటప్పుడే అసలు కల్యాణి గురించి నాకేం తెలీదనిపిస్తుంది.

మొట్టమొదటిసారి కల్యాణి వాళ్లింటికెళ్లినపుడు, శ్రీధర్‌తో పరిచయంలేదు. శ్రీధరు ఇంట్లోలేడుకూడాను. నేను కూర్చుంటూ 'ఆయన లేరా?' అనడిగాను.

"లేరుగాని— నీకూ ఆయనకీ చాలా పోలికలున్నాయోయ్! క్రికెట్ మాచ్ ఉంటే చాలు ఆవాళ ఆఫీసుకు సెలవే!' అంటూ చాలా చెప్పింది. సినిమా అంటే ఇష్టంలేదట. నాలాగే ఆర్టు ఎగ్జిబిషన్స్‌కి, నాటకాలకీ, గానసభలకీ వెళుతూవుంటారట! నన్నుకాకపో

యినా నా లక్షణాలున్నవాడిని పెళ్లిచేసుకుంది సంతోషమే! నేను శ్రీధర్‌ని ఊహించుకుంటున్నాను. పెళ్లినాడు చూశానుగాని, ఆ మొహం గుర్తులేదు. నల్లగా, పొట్టిగా, చిన్నకళ్లూ, కళ్ళజోడు కల్యాణికి తగనట్టు ఉంటాడని అనుకుంటూ ఉండేవాణ్ణి! గదులన్నీ కలియబెట్టాను, ఫొటోకోసం.

'ఏమిటలా వెతుకుతున్నావ్ అనడిగిందిః' నేనలా గోడలవైపు చూస్తుంటే.

'మీ పెళ్ళినాటి ఫొటో'

'లేదు.'

'అదేం?'

'అదంతే ఆయనకి ఫొటోలు తీయించుకోవడం ఇష్టంలేదు.' శ్రీధరు నా ఊహలతో సరిపోయాడో లేదో చూసుకుందాం అంటే ఆ మనిషి లేడు. కనీసం ఫొటోకూడా లేదు. టిఫిన్ ఏదో తీసుకొచ్చి ఇచ్చింది. తింటూ నేను వేయబోయే ప్రశ్నలని రిహార్సల్ చేసుకుంటున్నాను. వంటింట్లోంచే శ్రీధరు గురించి, తన చదువు గురించి కొత్త చుట్టాలగురించి గడగడా చెప్తూపోతోంది. నేను వింటున్నట్లు 'ఊ!' 'ఊ' అంటున్నాను. వంటింట్లో పనయిపోయింది కాబోలు! హాల్లోకొచ్చి ఎదురుగా కూర్చుంది. నన్ను కాస్సేపూ టీపాయ్‌మీద ఉన్న పేపరు కాస్సేపూ చూస్తోంది. నన్నేమీ అడగదేం? ఎలా ఉన్నావనిగాని కాలేజీ రోజులు జ్ఞాపకం రావడంలేదా అనో ఏదో ఒకటి అడగొచ్చుగా!

'మా ఇల్లెలా వుంది?' చివరికి ఇదీ ప్రశ్న. ఇల్లెలా ఉంటే నాకేం? పెళ్ళయిన సంవత్సరానికి వాళ్లింటికివస్తే, నా మంచి చెడ్డలు అడగడం మానేసి ఇల్లూ, గోడలూ, సున్నప్పెచ్చులూ ఎలా ఉన్నాయని అడుగుతుందేం? అప్పుడే తన యిల్లూ, తన మొగుడూ తనూ సెపరేట్ కంపార్టుమెంటయిపోయారన్నమాట!

'బాగానేవుంది' అంతకన్నా ఏమనాలో తెలియక.

'అలా ఉన్నావేం? అంతా దిగులేనా?'

దిగులుకాక ఇంకేమిటి' నేను కోరుకున్న మనిషి మరొకరి సొత్తయిపోవడం దిగులుకాదూ! ఇలా పరాయివాడిలావచ్చి పలకరించిపోవడం దిగులుకాదూ! నాలో ప్రేమ తుఫాను రేకెత్తించి తీరంచేరుకున్న ఆమెనుజూస్తే దిగులుకాదూ!

"అసహ్యించుకుంటున్నావా సూర్యం" దొరికి పోయాను. మాట్లాడక పోయినా ఎదురుగా కూర్చుంటే చాలు, మెదడుని చదివేస్తుంది కల్యాణి.

"ఎందుకు ?" అక్కడికి సంభాషణ ముగిసింది.

తిరిగి వచ్చేస్తున్నప్పుడు "స్నేహితుడిలా నెలకోసారయినా వచ్చి పోతూండు"అంది ఆ కళ్ళలో నాక్కావలసినది దొరికింది. అలాగేనని వచ్చేశాను. ఆరోజునుండే కల్యాణి ఆలోచనలు ఎక్కువయాయి—

* * * *

ఓ రోజు ఆఫీసులో ఫైళ్ళలో తలమునిగి వున్నాను. చికాగ్గావుంది. లంచ్ టైమ్

అయితే వెళ్ళి కాఫీ తాగి వద్దామనుకుంటున్నాను. ఎంతకీ కావడంలేదు. విసుగ్గా ఫైళ్ళు తిరగవేస్తున్నాను. "ఏమిట్రోయ్! సూర్యం! ఇక్కడున్నావు" ఎవరిదో కంఠం వినిపించి తలెత్తాను. గోపాలం. ఆఫీసరుతో పనుండి వచ్చాడట. పనయ్యాక రమ్మంటూ అలా బయటకి తీసికెళ్ళాడు.

"నువ్వింకా ఏ ఎమ్మెస్సీవో చేసి, ఏ ఫర్మ్‌లోనో సైంటిస్టుగా ఉంటావోనని అనుకుంటే ఇదేమిట్రా!" నేను, కల్యాణి, పెళ్ళి, ఉద్యోగం అన్నీ చెప్పాను వాడి సంగతి చెప్పమన్నాను— ఏవేవో చాలా ఉద్యోగాలు చేసి విడిచిపెట్టాడట! ప్రస్తుతం అదేదో కంపెనీకి రిప్రజెంటేటివ్‌గా ఉంటున్నాట్ట! ఇంకా ఏమేం చెయ్యదల్చుకున్నాడో కూడా చెప్పాడు. నా సంగతి నచ్చినట్లుంది. అలాగే మాట్లాడాడు.

"ప్రేమ ప్రేమ అంటూజీవితాన్ని పాడు చేసుకుంటావ్రా! మనం సుఖంగాజీవిస్తే గదరా మరొకరి గురించి ఆలోచించేది. నీకు అందం కనపడేదెప్పుడు! చీకూ, చింతా లేకుండావున్నప్పుడు అందం లేనప్పుడు ప్రేమాలేదు. ఎలాంటి అందమైనాసరే! అఫ్ కోర్స్ డిసీజ్ వన్ ఫేస్ ఆఫ్ లవ్ అనుకో! అసలునేనెవర్ని పెళ్ళిచేసుకున్నానో తెలిస్తే ఆశ్చర్య పోతావ్! కమలని, మన చంద్రాన్ని మనస్ఫూర్తిగా ప్రేమించి వాణ్ణి తప్ప మరెవర్నీ పెళ్ళాడనని ఘంటా పథంగా చెప్పిన కమలని! ఒకసారొచ్చి చూడు, అదేం బాధ పట్టంలేదే? పోనీ చంద్రాన్ని తీసుకో వాడెంత హాయిగా ఉన్నాడు? ఇలాంటి విషయాలని లైటుగా తీసుకోవడం తెలియాలి. చిన్నప్పటి సరదాల్లో అదొకటిగా తీసుకోవాలి! అసలు ప్రేమంటే తెలీనివాళ్ళు ప్రేమిస్తారు, అది తెలిసినవాళ్ళు అసలు ప్రేమించరు. అసలు ప్రేమనేది లేదు ఒకరకంగా. నామీద కలియబడకు. నే చెప్పేది సాంతం విను. ప్రేమే వుంటే ప్రేమ వివాహాలు సక్సెస్ అయిుండేవి. నేను ఫలానా అమ్మాయిని ప్రేమిస్తున్నాను అంటే వెలివేసినట్లు ఎందుకు చూస్తున్నారు జనం? ప్రేమమీద సదభిప్రాయం లేకనేకదా! ప్రేమించిన నువ్వెందుకు భయపడ్డావ్? కల్యాణి ఎందుకు భయపడింది? ఇవెప్పుడైనా ఆలోచించావా? అసలు కల్యాణి నీకు మాటి మాటికీ ఎందుకు జ్ఞాపకం వస్తోందో తెలుసా? ఒకటి కాలం, అంటే నీ విద్యార్థిదశ దాటి రెండు సంవత్సరాలు అయింది, కల్యాణి పెళ్ళయి సంవత్సరం అయింది. రెండు దూరం. ఇద్దరూ ఒకే ఊర్లో ఉంటో, కావాలనో, అక్కర్లేదనో తరుచు కలుసుకుంటున్నారు కాబట్టి. ఇవి రెండూ పెరిగితే నువ్వు కల్యాణిని మర్చిపోయి, పెళ్ళిచేసుకుని హాయిగా ఉండేవాడివి. ఇప్పుడయినా మించి పోయిందేమీలేదు. మీ ఆఫీసరు నాకు పరిచయం. ట్రాన్స్‌ఫరు కావాలనుకుంటే చెప్పు" అన్నాడు, మరికాస్సేపు అవీ ఇవీ మాటాడి వెళ్ళిపోయాడు వాడైతే వెళ్ళిపోయాడు గాని వాడు వదలి వెళ్ళిన విషయాలు నన్ను పట్టుకున్నాయి, ప్రేమనేది లేదా ప్రేమకి ధైర్యంలేదా! దూరం ప్రేమని దూరం చెయ్యగలదా? నన్ను కన్విన్స్ చెయ్యడానికి మాటలు చెప్పాడేమో ఇల్లు చేరాను గాని, నిద్రను చేరలేకపోయాను.

నెల్లాళ్ళు గడిచిపోయాయి, నిర్లిప్తతలోనే, నిరీక్షణలోనే, నిస్తేజంగానే— విశాఖపట్నం ట్రాన్స్‌ఫరయిందని విన్నాను, నాకు. గోపాలం అన్నంతపనీ చేసాడన్నమాట. పొగడాలో, కొనియాడాలో తలీలేదు గోపాలాన్ని. వెళ్ళిపోయాను విశాఖపట్నం, కల్యాణికి

కనిపించకుండానే. వెళ్ళాక అనుకున్నాను కల్యాణిని ఎందుకు కలియలేదాఅని. ఉత్తరం వ్రాద్దామనుకున్నాను. వ్రాయలేదు. బహుశా వ్రాయలేక పోయానేమో!

సముద్రపుగాలి, ఇసకదిబ్బలు, దూరంగా కొండలు, అంతా కొత్త వాతావరణం, కొత్త పరిసరాలు, కొత్తపరిచయాలు. కల్యాణి ఎప్పుడోగాని జ్ఞాపకం రావడంలేదు. సముద్రం ఒడ్డున కూర్చుని వున్నప్పుడు, అలల చిలిపితనం చూస్తూంటే మాత్రం కల్యాణే ప్రత్యక్షమయేది. రెండు సంవత్సరాలు గడిచేయి. ఎన్నో మార్పులు, సృష్టిలో, వాతావరణంలో, నాలో, అన్నిట్లోనూ. సరోజకి పెళ్ళి చేసాను. అమ్మ నన్నూ, ఈ లోకాన్నీ కూడా విడిచిపెట్టింది తనకున్న ఒక్క ఆశా, అదే కోడల్ని చూడడం, తీర్చుకోకుండానే వెళ్లిపోయింది.

ఇప్పుడు నేనొంటరిని. కల్యాణి నన్ను బాధించడంలేదు. జ్ఞాపకం వస్తే ఆనందంగానే వుంది నా గురించి ఏమనుకుంటోందోనని ఊహించుకుంటూ నవ్వుకుంటూ వుంటాను ఇప్పుడు. ఒక శుభ ముహూర్తాన అందరికీ శుభలేఖలు గోపాలానికీ, కల్యాణికీ ఉత్తరాలు కూడా రాశాను. గోపాలానికి రాస్తూ—

''ఒరేయ్ గోపాలం! నిజంగా నాకు నువ్వు చాల ఉపకారం చేసావ్! నిన్నెలా పొగడాలో తెలీకుండా వుంది. ప్రేమని తప్పుగా అర్థంచేసుకున్నాను. ప్రేమజీవితంలో ఓ భాగం అన్న సత్యం తెలీక ప్రేమే జీవితం అనుకున్నాను. పెళ్ళికి తప్పకుండా రా'

కల్యాణికి రాసింది ఓ మారు చదువుకున్నాను—

''కల్యాణికి, నువ్వన్నమాట నెరవేరుస్తున్నాను. నేనిప్పుడు పెళ్ళిచేసుకుంటున్నాను. కవిత్వం రాయడంలేదు. వస్తావ్ కదూ!''

ఉత్తరాలు పోస్టుచేసి సంతృప్తిగా గాలి పీల్చాను. నాకు నేనే ఎదిగిపోయినట్లు కనిపిస్తున్నాను.

ఇది నా జీవితంలో మూడోవంతు చెల్లిపోయాక! నవ్వొచ్చింది—

# కనువిప్పు

ఇరివెంటి కృష్ణమూర్తి

ఆరు నెలలు మంచానపడిఉన్న పరంధామయ్య ఇప్పుడిప్పుడే లేచి తిరుగుతున్నాడు. ఆరుగురు పిల్లలతో ఇల్లాలు సంసారాన్ని ఎలా సర్దుకోగలిగిందో పరంధామయ్యకు తెలిసినా తాను మాత్రం ఏమీచేసే స్థితిలో లేడు. తాను పనిచేసే కర్మాగారం యజమానులు ఋణం ఇచ్చి సాయపడినా అప్పులేవీతీరలేదు. డాక్టర్లకియ్యవలసినది చాలాఉంది. పిల్లల్లో అందరికంటె పెద్దవాడు జనార్దనం కాలేజీలో చేరుతానంటున్నాడు. ఎంతలేదన్నా మూడువందలు పోయందే కాలేజిలో ప్రవేశించడం సాధ్యంకాదు. సత్తువకోసం మంచి ఆహారం తీసుకొమ్మని డాక్టర్లు మిత్రులు సలహాలిస్తున్నారు. ఇల్లాలి నగలన్నీ సంసారంకోసం కర్పూరమైపోయాయి. ఈ స్థితిలో పరంధామయ్య పెద్దకూతురు వివాహం కూడా ఒకపెద్ద సమస్యగా తయారైంది. కట్నం పొయ్యందే ఎవడూ చేసుకోడు. సినిమాల్లోని, నవలల్లోని హీరోలు సమాజ లో ఎక్కడా తారసిల్లడంలేదు. అన్నీ అప్పులు అప్పులు. తీర్చడంకోసం చేసిన అప్పులు. పిల్లలను చదివించాలి వాళ్ళకేదో ఆధారం కల్పించాలె. చదువుకుంటున్నప్పుడు తాను కన్న బంగారు కలలన్నీ ఒక్కొక్కటి కురువని మబ్బుల్లా కరిగిపోతున్నవి. తనకిప్పుడు యాభై యేళ్లు. సంసారం సంగతి ఎలా ఉన్నా ముందు జనార్ధనాన్ని కాలేజికి పంపించాలి. పెద్ద చదువులు చెప్పిస్తే వాడు ప్రయోజకుడై తనకు తోడౌతాడనే ఆశ అతనితో ఎన్నో కడపలు తొక్కించింది. ఎంతమందినో అడిగించింది. తనకెవ్వడూ సాయపడలేదు. పోనీ జనార్దనమైనా చిన్న పనిలో ప్రవేశిస్తే కొంతైనా నయంగా ఉంటుందని తలపోసి చెప్పిచూశాడు. కాని అతడు భోజనానికే ఇంటికొస్తాడు. వచ్చినప్పుడల్లా ఫలానా ఫలానా వాళ్ళ కొడుకులు బాగుపడిపోతున్నారనీ తనను కాలేజీకి పంపించకపోతే ఇంట్లో నుంచి వెళ్లిపోతానని బెదిరిస్తూ ఉంటాడు. తండ్రి భారాన్ని కొంతైనా దించగలిగే సంస్కారాన్ని వాడి చదువు వాడికియ్యలేకపోయింది. పైగా తానొక నిష్ప్రయోజకుడికి కొడుకై పుట్టినందుకు తననుతాను నిందించుకుంటూ తమ్ముళ్ళనూ, తల్లినీ చెల్లెళ్ళను ఏవేవో మాటలంటూ ఉంటాడు. పరంధామయ్య స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న యోధుడు. నీతి నిజాయితీలపై నమ్మకమున్న మనిషి. అదొక రకమైన బలహీనత అని అసమర్థత అనీ జనార్దనం అభిప్రాయం. జనార్దనం పరీక్షలు ప్యాసవుతూ వచ్చాడేకాని అతనికేవిషయం కూడా స్పష్టంగా తెలియదు. కాలేజీలో చేరాలనే కోరికతప్ప, మరేలక్ష్యం అతనికి లేదు. కాలేజీలో చేరే గడువు దాటిపోతున్నది. నాన్న తనకోసం ఏమీ చెయ్యడంలేదని ఆర్భాటం చేస్తున్నాడు పరంధామయ్య ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు.

ఒకనాటిరాత్రి జనార్దనం ఇంటికి చేరుకోలేదు. వాడన్నంతపనీ చేశాడని ఇల్లాలు ఏడ్పులు ప్రారంభించింది. పరంధామయ్యకేమీ తోచడంలేదు. నిద్రరాలేదు. ప్రొద్దున్నే వచ్చాడు జనార్దనం తూలుతూ. రాగానే నిద్రపోయాడు. లేచాక అడిగితే విద్యార్థులేదో ఉద్యమం నడుపుతున్నారనీ, రాత్రంతా గోడలపై నినాదాలువ్రాసి వాళ్ళకు సహాయపడినాననీ చెప్పాడు. పరంధామయ్యకేమీ తోచలేదు. కాలేజిలో వేస్తే చదువుకోనైనా చదువు కుంటాడేమో, ఈ సహవాసాలు మానుతాడేమోననుకున్నాడు. ఏదో నిశ్చయం చేసుకుని బయలుదేరాడు.

మర్నాటిరాత్రికూడా జనార్దనంరాలేదు. పొద్దునే ఇంట్లో అడుగుపెట్టగానే 'ఎక్కడికెళ్ళావు రాత్రంతా త్వరగా ముఖం కడుక్కొని ఫ్లాస్కుతీసుకొని హాస్పిటల్‌కు వెళ్లిరా!' అన్నది.

''జనార్దనం ఎందుకమ్మా? హాస్పిటల్‌లో ఎవరున్నారు.'

"మీ నాన్న. గాయాలతో పడి ఉన్నారు' అంది రుద్ధ కంఠంతో

''గాయాలా ?''

ఏదో ఆందోళనట బస్సుమీద రాళ్ళు రువ్వినారట. ఏంకర్మమో! నీరసంగా ఉన్న మీ నాన్నకే తగిలాయట''

జనార్దనం వెంటనే హాస్పిటల్‌కు వెళ్ళాడు, ముఖానికి తలకు కట్లతో ఉన్న తండ్రిని చూచి 'నాన్నా!' అన్నాడు. పరంధామయ్య కళ్లు తెరువకుండనే 'రా నాయనా.' ఇలా కూర్చో!

"ఏం నాన్నా! నీకీ గాయాలేమిటి''

''అంతా కర్మ! నీ కాలేజి ఫీజుకోసం తిరుగుతూనే ఉన్నానా? ఒకమిత్రుడు సహాయం చేస్తానని వాగ్దానం చేశాడు. నిన్న సాయంత్రం రమ్మన్నాడు. బస్సులో బయలుదేరాను. ఈ హాస్పిటల్ కెదురుగానే నిన్న ఆందోళనకారులు నేనున్న బస్సుపై రాళ్ళు రువ్వారు. చాలామంది దిగిపోయారు. సీట్లకింద తలదాచుకున్నారు. నాకు త్రాణలేదు. నేను హడావిడీ చేయలేకపోయాను. దీపాలారిపోయాయి డ్రైవర్ను కండక్టర్‌ను ఆందోళనకారులు చావమోదారు. పోలీసు లొచ్చారని ఎవరో అంటున్నారు. నాకు స్పృహతప్పిపోయింది. ఆతరువాత ఏమైందో నాకు తెలియదు. రాత్రి పదిగంటలకు మీ అమ్మా వాళ్ళంతా వచ్చి వెళ్ళారట.''

''నిన్న సాయంత్రమా ? ఈ హాస్పిటల్‌కు ఎదురుగానా !'' జనార్దనం ఒళ్లు వణికిపోయింది. కంఠం రుద్ధమైపోయింది. ఆ సంఘటనతో తనకూ సంబంధం ఉందనీ జనార్దనం గ్రహించాడు.

''నేను పోతే మీకెవరు దిక్కు నాయనా! ఈ పద్దెనమిదేండ్లూ మిమ్మల్ని ఎలాగో పెంచాను. నాకు లేకున్నా మీకేలోటు కలిగించలేదు పెద్దవాడవు నీవైనా ప్రయోజకుడవనుకొన్నాను, నీ చదువే ఇంకా ముగియలేదు. ఏదో నీతి నిజాయితీ అంటుంటాననీ నిష్ప్రయోజకుణ్ణనీ నీవంటూనే ఉంటావు కదా! మా రోజులు అలా గడిచిపోయినవి.

జనార్దనం తలతిరిగి పోయింది. దుఃఖం పట్టలేక తండ్రిమీద పడి బావురమని యేడ్చాడు. 'వస్తా నాన్నా' అని హాస్పిటల్ వెలుపలికి వచ్చి బస్సెక్కాడు.

కొంత దూరంవెళ్ళాక ఆందోళనకారులు 'మేమీ బస్సును తగుల బెట్టాలె. మీరంత దిగండ'న్నారు. అంతా దిగిపోయారు. జనార్దనం దిగలేదు. ఒక ఉద్యమకారుడు ''ఎందుకు దిగవూ ? దిగకపోతే నీతోనే బస్సును కాల్చేస్తాము'' అన్నాడు. జనార్దనం 'అలాగే కానీయండి కాని నేనుమాత్రం దిగను.'' ఆందోళనకారులు అరుపులు ప్రారంభించారు. అందులో ఎవరో జనార్దనాన్ని పోల్చుకుని 'ఏంరా ! ఏమిటీ సహాయ నిరాకరణం తొత్తుల్లో చేరి పోయావా ?' అని అడిగాడు. ''జాతిసొత్తును రక్షించేవాడు తొత్తు అయితే నేనూ తొత్తునే'' అన్నాడు. అప్పుడు జనార్దనం వణికిపోతున్నాడు, కన్నుల్లో నీరు నిండినది. తూలుతున్నాడు. అట్లాగే సీటుపై ఒరిగిపోయాడు.

# చావద్దు

శీలా వీర్రాజు

ఇల్లు యింకా వంద గజాల దూరంలోవుంది. అరుగు మీద జనం కనిపించడం లేదు. ఏమయినా జరిగివుంటే జనం యింటి ముందు పోగయివుండేవారు. నేల కూడా బురదతో తడిగాలేదు.

ప్రాణం కొంత కుదుటపడింది. నూట యాభై మైళ్ళ దూరం నుంచి బిగబట్టిన భయం, యాభై గజాల దూరంనించి బిగబట్టిన ఊపిరి ఒక్కసారిగా సడలి పోయాయి. "హమ్మయ్య" అనుకున్నాడు. రిక్షా గుమ్మం ముందు ఆగింది

రిక్షా ఆగడం చూసి చుట్టుపట్ల యిళ్ళ వాళ్ళు అరుగుల మీదకి వచ్చి చూస్తున్నారు. కొందరు తలుపుల వెనకనించి. మరి కొందరు కిటికీల అవతల నించి.

వాళ్ళు అలా చూడ్డం ఏమిటోలావుంది. కొత్తగా వుంది. ఇంతకు ముందు అనేక సార్లు వచ్చాడు. అప్పుడు యిలా చూళ్ళేదు. యధాలాపంగా చూసి, కాస్సేపు సరదాగా, ఆసక్తిగా నిలుచునేవారు. ఇప్పుడు సరదాలేదు. ఆసక్తి మాత్రం వుంది. దానితోపాటు జాలి కూడా.

వాళ్ళు అలా చూస్తోంటే మళ్ళీ భయం వేసింది. గుండె దడదడ లాడింది రిక్షా వాడికి డబ్బులిచ్చి మెట్లు ఎక్కుతోంటే కాళ్ళు తడబడ్డాయి. ఊపిరి బిగపట్టాడు. తలుపు తట్టాడు.

ప్రభ వచ్చి తలుపు తీసింది. "రా బావా" అంది.

ఆమె పిలుపులో జీరలేదు. చూడగానే బావురు మనలేదు. ఓ నిమిషం ఆగిపోయి నట్టు అనిపించిన గుండె మళ్ళీ కొట్టుకోడం మొదలెట్టింది.

"మీ అక్కయ్య కెలావుంది?"

"కొద్దిగా కోలుకుంది. హాస్పిటల్లో చేర్పించాం"

"ఇంతకీ జబ్బేమిటి?"

ప్రభ మాట్టాడలేదు. "అమ్మా నాన్నా హాస్పిటల్లోనేవున్నారు. స్నానం చేసి వెళ్దువు గాని, కోటిగాడ్నిచ్చి పంపుతాను... ఒరేయ్ కోటీ! భూషణం బావ వచ్చాడురా"

ప్రభ లోపలికి వెళ్ళిపోయింది. నాగభూషణం నడవాలో నుంచుండిపోయాడు. బిక్కు బిక్కు మంటున్నట్టుంది. నడవా. గోడలు మౌనంగా నిల్చుని పరిశీలనగా చూస్తు న్నట్టున్నాయి. ఎదురుగా నిల్చుని పలకరించకుండా జాలిగా చూస్తున్న బంధువుల్లా వున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. మాటలురాని వెర్రిదానిలా దిగాలుగావుంది

ఆ మూల రేడియో. ప్రభ యింట్లో వుండికూడా ఆ రేడియో అలా మూగ పోవడం ఆశ్చర్యంగానే వుంది. ఆమెకు పాటల్పిచ్చి. ఎప్పుడూ వాగుతూ వుండాల్సిందే—సిలోనో, వివిధ భారతో, మరోటో-ఏదో ఒకటి.

కోటేశ్వర్రావు వచ్చి పలకరించాడు. చిన్నతనం. పలకరించడమేగాని పరామర్శిం చడం తెలీదు.

"మీ అక్కయ్యకి ఎలావుంది"? అని అడిగాడు నాగభూషణం.

"ఇప్పుడు బాగానేవుంది. పొద్దున్న వెళ్ళొచ్చాను" అన్నాడు ఆ అబ్బాయి.

ప్రభ నీళ్లతోడానని పిలిస్తే వెళ్ళి స్నానంచేసి వచ్చాడు నాగభూషణం. కాఫీకాచి పట్టుకొచ్చింది. తాగుతూ—

"నిన్ననే రజనీ ఉత్తరం రాసింది. అందులో, కనీసం ఒంట్లో నలతగా వుంటోం దని చూచాయగాకూడా ఏంలేదు ఇంకో వారం పదిరోజుల్లో వీలుచూసుకుని తనని తీసు కెళ్ళడానికి రమ్మంది. సరిగ్గా రోజుతిరక్కముందే యీ టెలిగ్రాం: ఏమిటంత జబ్బు? డాక్టరు ఏం చెప్పాడు?" అన్నాడు నాగభూషణం.

'ఇప్పుడే వస్తున్నా... పొయ్యిమీద పోపు మాడిపోతోంది' అంటూ లోపలికి హడా వుడిగా వెళ్ళిపోయింది ప్రభ.

నాగభూషణం కాఫీ తాగేశాడు. ప్రభ వంటింటి పనిలో సతమతమౌతున్నట్టుంది. వంటింట్లోంచి గిన్నెల శబ్దం వినిపిస్తోంది. ఓ రెండు నిమిషాలుచూసి హాస్పిటల్‌కు వెళదా మని లేచాడు. ప్రభతో చెప్తే 'పదినిమిషాలు ఆగు బావా, తమ్ముణ్ణి దుకాణం దగ్గరకు పంపించాను వచ్చేస్తాడు. వాణ్ణి తోడు తీసుకుని వెళ్దువుగాని' అంది.

'ఫరవాలేదులే నేను వెళ్ళగలను. వూరేం కొత్తకాదుకదా. ఏ హాస్పిటలో చెప్పు' అన్నాడు.

ఆమె హాస్పిటల్ పేరూ, ఎక్కడవున్నదీ మొదలైన వివరాలు చెప్పింది.

నాగభూషణం అరుగుదిగి వీధిలోకొచ్చాడు. ఇళ్ళ అరుగులమీద వున్నవాళ్ళచూపు లన్నీ అతనిమీదే వున్నాయి. కుళాయిదగ్గర ఆడవాళ్ళందరూ అతనివైపే కళ్ళార్పకుండా చూస్తున్నారు. గుసగుసలాడుతున్నారు. వాళ్లు అలా పట్టిపట్టి చూడ్డం అతనికి యిబ్బందిగా వుంది. పెళ్ళాం లేచిపోయిన మొగుణ్ణో, పెళ్ళాం ఆత్మహత్య చేసుకున్న మొగుణ్ణో చూసి నట్టు చూస్తున్నారు. ఏదైనా రిక్షా కనిపిస్తే బావుణ్ణు. ఒక్కటీ కాళీగా కనిపించడంలేదు. తలవంచుకుని నడుస్తున్నాడు. తప్పుచేసినవాడిలాగ. ఆ నడక అతనికే కష్టంగావుంది. రోడ్డు చివరికి వచ్చాడు.

రిక్షా దొరికింది. హాస్పిటల్‌కి బేరమాడి, ఎక్కికూచున్నాడు. తొందరగా పోనివ్వ వోయ్ అని వాడికి చెప్పాడు. ఎంతగా నచ్చచెప్పుకున్నా మనసు అదిరి అదిరి పడుతోంది. రజనీకి ప్రమాదం తప్పివుండొచ్చు. లేకపోతే ప్రభ అంత తాపీగా మెసిలేదికాదు. అలాటి ప్రమాద పరిస్థితేగాని వుంటే, రావడంతోటే హాస్పిటల్‌కు బయలుదేరమనేది. కాని—

నాగభూషణం తేలిగ్గా గాలి పీల్చలేకపోయాడు. వీధిలోవాళ్ళ జాలిచూపులే అతన్ని భయపెడ్తున్నాయి. బావురుమంటోన్న యిల్లూ, గుసగుసలాడ్తోన్న వీధీ అతన్ని ఉడికిస్తున్నాయి. ఊపిరికీ ఊపిరికీ మధ్య గతుక్కుమంటున్నాడు. ఆలోచనకీ ఆలోచనకీ మధ్య లేతాకులా అల్లల్లాడిపోతున్నాడు. రజనీని కళ్ళతో చూసేవరకు మనసుకు అసహనమే. నిజాన్ని నమ్మలేని పిరికితనం జ్వరంలా ఆవరించింది. ఆలోచించేకొద్దీ జ్వరం మరింత తీవ్రమౌతోంది. ఆ జ్వరతీవ్రతలోనే అతను ఒక్కసారిగా తుళ్ళిపడ్డాడు. ఇంతకీ రజనీకి ఏమిటి జబ్బు?

ప్రభని అడిగినా చెప్పలేదు. ఏదో ప్రాణంమీదకి వచ్చే జబ్బేమో. ఏ విషజ్వరం లాంటిదో, గుండెనొప్పో, సెర్బ్రిరల్ హెమరేజో...

నాగభూషణం ఆలోచించలేనివాడిలా రిక్షావెనక్కి జారబడిపోయాడు. భయం భయంగా బితుకుబితుకుగా ఊపిరిపీల్చి వదులుతున్నాడు. రెప్పల్ని సాగదీసి అతికించినట్టు గట్టిగా కళ్లు మూసుకున్నాడు.

రిక్షా ఆగిపోయింది. కళ్లు తెరిచాడు. హాస్పిటలు.

రెండుమూడు చోట్ల వాకబుచేసి వెళ్ళాడు. అత్తగారు కనిపించింది. బెడ్‌మీద రజనీ దుప్పటి కప్పుకుని నిద్రపోతోంది.

'వచ్చేవా నాయనా' అంది అత్తగారు. ఆమె కంఠంలో జీర. ఆమె ముఖంలో దుఃఖం గూడు.

రజనీ కళ్ళుతెరిచి చూస్తోంది. నిద్రపోవడంలేదు. మేలుకొనేవుంది. కళ్ళుతెరిచి అలాగే చూస్తోంది. ఒకటే చూపు. పాడైపోయిన గడియారం ముల్లులాగ కదలని చూపు. ప్రాణం ఎగిరిపోతే నిలిచిపోయినప్పటి చూపు. భయపెట్టే చూపు.

అతనికి భయంవేసింది. క్షణంసేపు గుండె దడదడలాడింది. అంతలోకే కుదుటపడింది. ఆమె పెదాలు కదులుతున్నాయి. అది కదలికకాదు అదురు. భూకంపం వస్తే నేల అదిరినట్టు. ఆవిరికి అడ్డుపెట్టిన మూత ఎగిరి పడ్తున్నట్టు. గుండెల్లో దుఃఖం గొంతులోంచి తన్నుకొస్తోంది గాబోలు పెదాల్ని ఎంత గట్టిగా బిగించినా నిలవడంలేదు. దయాంభ్రమ్‌లా అదిరిపోతున్నాయి. పట్టు సడలిపోయి అల్లల్లాడిపోతున్నాయి.

'ఎలావుంది రజనీ...నీ వొంట్లో యిప్పుడెలావుంది?' నుదుటిమీద చెయ్యేసి ప్రేమతో జుత్తు నిమురుతూఅడిగాడు.

ఆమె రబ్బరు బుడగలా పేలిపోయింది. గండిపడి పొర్లిపోతోన్న వరదలాగ, విరుచుకుపడుతోన్న వెల్లువలాగ దుఃఖం పొర్లిపోతోంది. కళ్ళనుండి తెగిపోని ఒకేధారగా కన్నీళ్ళు. తలగడలో ముఖం దాచుకుని భోరున ఒకటే ఏడుపు. పసిపాపలాగ వెక్కివెక్కి ఏడుస్తోంది. ఎంతగట్టిగా తలగడకి నోటిని అదుముకున్నా ఏడుపు ఆగడంలేదు.

నాగభూషణం ఎంతగా ఆమెను సముదాయించినా ఆ ప్రవాహానికి అడ్డు కట్ట వేయలేకపోతున్నాడు. అతను ఊరడించే కొద్దీ ఆమెకు మరింతగా దుఃఖం కట్టలు తెంచుకుని పొర్లుకొస్తోంది. ఊపిరి పీల్చడం కూడా మర్చిపోయి, ఒక్కొక్కప్పుడు దుఃఖాన్నే

మింగేసి ఎక్కిళ్ళు పడుతోంది. ఆమెను ఊరుకో బెట్టడం అతనికి చేతకాలేదు. ఆమె ఏడుపు చూస్తే అతనికీ కళ్ళ నీళ్ళు తిరుగుతున్నాయి. మాటకూడా సరిగా గొంతులోంచి రావడంలేదు. మాటిమాటికీ, గుటక వేసి, గొంతు సరిచేసుకుని ఊరుకోబెడుతున్నాడు.

''ఏమిటండీ జబ్బు ?'' నాగభూషణం అత్తగార్ని అడిగాడు.

అతని అత్తగారు గచ్చుమీదే చతికిలపడి గోడకి జారపడి కొంగు అడ్డు పెట్టుకుని లోపల్లోపలే ఏడుస్తోంది. అతను అడిగిన ప్రశ్నకు ఆవిడ మరింతగా దుఃఖంతో కుళ్ళి పోయింది.

వాళ్ళను చూస్తోంటే నాగభూషణానికి గుండె నిలవడంలేదు. ఏ భయంకరవార్త వినాల్సి వస్తుందోనని అదిరిపోతున్నాడు. ప్రతి సెకనూ మీద పడబోయే పెద్దపులిలాగ అనిపిస్తోంది.

తను ఊహించినది నిజమే కావచ్చు. ఏ గుండె జబ్బో అయితే తన గతేమిటి ? తన రజనీ తనకిక దక్కదా . తన ప్రాణానికి ప్రాణంగా మెలిగిన తన రజనీ తనను ఒంటరి వాడ్నిచేసి వెళ్ళిపోతుందా ! ?

నర్సు వచ్చి కోప్పడింది. ''ఏమిటండీ ఆవిడని అలా ఏడిపిస్తున్నారు. ఆవిడ కోలు కోవాలా, వద్దా ! అసలే ఆవిడ మనసు బాగా దెబ్బతింది. ఎవరోఒకరు రావడం, ఆవిడని ఏడిపించడం—యిదేం బావుండలేదు. మీరు కాస్సేపు బయటికి వెళ్ళండి'' అంది నాగ భూషణాన్నీ, వాళ్ళత్తనూ చూసి.

''సిస్టర్ ! ఊరునుంచి యిప్పుడే వచ్చాను. రజనీకి సీరియస్‌గా వుందని మామగారు టెలిగ్రాం యిస్తే వచ్చాను. ప్రమాదమేమీ లేదు కదా. ఇంతకీ జబ్బేమిటో ఎవరూ చెప్పడం లేదు.... ఆవిడకున్న కంప్లైంట్ ఏమిటి సిస్టర్''.

''ఆయనే నమ్మా అల్లుడుగారు'' అంది వాళ్ళత్త.

''అలాగా, రండి...డాక్టరుగారిని కలుసుకుందురుగాని. వివరంగా అన్నివిషయాలూ మాటాడుతారు'' అంది ఆమె.

అలా అంటూ ఆమె చూసిన జాలిచూపు అతను భరించలేకపోయాడు. గుండె చేత్తో పట్టుకున్నట్టుగా నర్సువెంట వెళ్ళాడు. ఆమె అతన్ని బైట కూచోబెట్టి డాక్టరుతో మాట్లాడి వచ్చింది. ఆ తర్వాత అతన్ని తీసుకువెళ్ళి పరిచయం చేసింది.

నాగభూషణం రజనీ ఆరోగ్యం గురించి అడిగాడు.

''మరేం ఫర్వాలేదు ఆవిడ కోలుకుంటున్నారు. ఆందోళన ఏం లేదనుకోండి. అయినా...'' డాక్టరు మధ్యలోనే ఆగిపోయి అతని వైపు చూశాడు.

'ఏమిటిది' అన్నట్టుగా చూశాడు నాగభూషణం.

''చాలా ఘోరం జరిగిపోయింది. మీరు దాన్ని ఎలా తీసుకుంటారో తెలీదు. అప్సెట్ కాకుండా తాపీగా సానుభూతితో ఆలోచించాలి.''

నాగభూషణం ఊపిరి బిగబట్టి 'చెప్పండి'' అన్నాడు.

"విజయదశమికి ఊళ్ళో పందిళ్ళు వేసి నాటకాలు వేస్తుంటారు కదండీ, చూద్దామని మీ ఆవిడ వాళ్ళతమ్ముడ్ని తీసుకుని వెళ్ళిందట. తిరిగొస్తున్నప్పుడు కాలవదగ్గర స్టూల్‌కి వస్తోందని వాళ్ళక్కయ్యని అక్కడే వుండమని చెప్పి గట్టు దిగాడట ఆ అబ్బాయి. రెండు నిమిషాల్లో తిరిగి వచ్చేసరికి ఆవిడ అక్కడలేదట. ఇల్లు దగ్గరే కదా, వెళ్ళిపోయిందేమో నని యింటికొచ్చి చూస్తే యింటి దగ్గరకీ రాలేదట. రాత్రల్లా వెతికారట కాని దొరకలేదు. పొద్దున ఆ కాలవ గట్టున ఆయిలు మిల్లు పక్కన హైస్కూలు కాంపౌండులో కొనఊపి రితో మూలుగుతోంటే వాచ్‌మన్ చూసి నలుగుర్ని పోగేసుకుని హాస్పిటల్లో చేర్చాడు. ఆ తర్వాత మీ యింట్లోవాళ్ళకి తెలిసింది. పందిళ్ళు చూస్తున్నప్పుడు ఎవరో ముగ్గురు వ్యక్తులు కొంతదూరం వెనక వెనకేవచ్చి ఏడిపించారట. ఆ తర్వాత మళ్ళా వాళ్ళు కనిపించలేదట. బహుశా వాళ్ళే యీ పనిచేసుంటారు. కనిపించకుండా వెంటబడి సమయంచూసి మీద పడి వుంటారు......."

నాగభూషణం ఆలకిస్తున్నాడే గాని డాక్టరు చెప్తున్నదేమీ వినిపించడంలేదు. తన మనస్సు వికలమైనట్టు డాక్టరుకి కనిపించకూడదని అతి ప్రయత్నంమీద నిగ్రహించుకునే ప్రయత్నంచేస్తున్నాడు. 'అలాగా...ఐసీ...' అని అతి సామాన్యంగా అనడానికి ప్రయ త్నిస్తున్నా ఆ కంఠం అతనికే వింతగా అనిపిస్తోంది. ఆలోచించే ఓపిక కూడా వున్నట్టు లేదు. మనసు మొద్దుబారి పోయినట్టుంది. చాలా నిస్త్రాణగా ఆలకిస్తున్నాడు.

వార్డులోంచి పిలుపువస్తే డాక్టరు '...మళ్ళీ కలుద్దాం' అని లేచాడు. నాగభూషణం యివతలికి వచ్చాడు. ఎక్కడైనా ఏకాంత ప్రదేశంలోకి వెళ్ళి కూచోవాలని వుంది. ఇలా అర్ధాంతరంగా వెళ్ళిపోవడం బావుండదని ఆగిపోయాడు. రజనీ దగ్గరకు వచ్చాడు. ఆమె యింకా ఎక్కిళ్ళుపడుతూనేవుంది. ఊరుకోమని చెప్దామనుకున్నాడు. ఎంత ప్రయత్నించినా నోటిలోంచి మాట బైటికి రావడంలేదు. మాటమాత్రమేకాదు కనీసం శబ్దంకూడా. మూగ వాడిలాగ అయిపోయాడు.

ఇంత అకస్మాత్తుగా తనలో వచ్చిన ఈ మార్పును రజనీ గుర్తుపట్టకూడదని లాకర్ మీదున్న బత్తాయికాయ తీసి వలుస్తూ కూర్చున్నాడు. అలా వలుస్తూ అతిప్రయత్నం మీద మాటల్ని కూడగట్టుకున్నాడు. వలిచిన తొనల్ని ఆమెకు యిస్తూ, కూడగట్టుకున్న మాటల్ని అనబోయి ఏమీ అనలేక పొడి పొడిగా "ఇంద,...యివి తిను" అని మాత్రమే అనగలిగాడు. అప్పటికే అతని కంఠం పూడుకుపోయింది. ఎవరో గొంతును పిడికిట్లో పట్టి బిగించేస్తున్నట్టు కీచుగా బైట పడ్డాయి మాటలు. ఇంకా నోరు విప్పితే మనసే బైట పడేటట్టుంది. మౌనంగా తొనల్ని ఒక్కొక్కటిగా వలిచి, లోపలి గింజల్ని తీసి ఆమెకు యిస్తున్నాడు. ఆమె అందుకోకపోతే అతనే ఆమె నోటిలో పెడుతున్నాడు. మధ్యమధ్య కళ్ళనీళ్ళు తుడుస్తున్నాడు. గాలికి తలవెంట్రుకలు మాటి మాటికీ నుదుటిమీదకు ఎగిరిపడు తోంటే వెనక్కు సర్దుతున్నాడు. రెండు మూడు అక్షరాల మాటలు పొడి పొడిగా అప్పు డప్పుడు మాట్లాడుతున్నాడు. ధారాళంగా మాటాడాలనుకున్నా సాధ్యం కావడంలేదు.

మామగారు ఫ్లాస్కులో కాఫీయో, పాలో పట్టుకొనివచ్చారు. ఆయన పలకరిస్తే

అతికష్టంమీద మాటలు తడుముకుంటూ సమాధానం చెప్పాడు. ఆ తరువాతకూడా మామగారే మాట్లాడుతూ వచ్చారు. అతనుమాత్రం శ్రోతగానే వుండిపోయాడు.

భోజనానికి టైము అయ్యిందని, ఇంటికి వెళ్లి భోంచేసి వద్దామని మామగారు పిలిచినా నాగభూషణం వెళ్ళలేదు. వెళ్తే వీధిలో వాళ్ళందరూ తనకేసి చూస్తారు. వాళ్ళచూపుల్ని తట్టుకోవడం యిప్పుడిక తనకి చేతకాదు. ఇంతకుముందు కొద్దిగానైనా భరించగలిగాడు. ఇప్పుడు అందరి ఎదుటికీ రావాలంటే సిగ్గుగావుంది. భయంగావుంది. తల విరిచేసినట్టుగా వుంది. ఏదీ పట్టించుకోకుండా ఎవరినీ చూడకుండా ధైర్యంగా వెళ్లే సాహసంలేదు చూసీ చూడనట్టు, చూసినా చూడలేదనుకునే నిర్లిప్తతా లేదు

అందుకే అతను ఇంటికి వెళ్ళలేకపోయాడు. చీకటి పడేవరకు హాస్పిటల్లోనే వున్నాడు. అక్కడ అంతసేపున్నా ఎక్కువగా మాట్లాడవలసిన అవసరం లేకపోయింది. నిద్ర వచ్చినా రాకపోయినా రజనీ కళ్ళుమూసుకుని పడుకునేవుంది.

నాగభూషణం రాత్రి బాగా చీకటిపడ్డాకగాని యింటికి వెళ్ళలేదు. భోంచేద్దామని కూచుంటే అన్నం సరిగా సహించలేదు. పడుకుంటే నిద్రకూడా కరువైపోయింది. మనసు నిండా అసహనం. ఆలోచనలనిండా అశాంతి. చింపిపారేసిన ఆలోచనలతో చెత్తకుండీలా వుంది మనసు. కాళ్ళు తుడుచుకొనే కొబ్బరిపట్టాలా పీచు రేగిపోయివుంది. పూడుకుపోయిన కాలవలా ఆలోచనలు పొర్లిపోయి చిత్తడి చిత్తడిగా వుంది. తనమీద తనకే కోపం. తనకేసి తను చూసుకోవాలంటే సిగ్గు. తన జీవితంమీద అసహ్యం, తనమీదజాలి.

తన కళ్ళ ఎదుటే ఒక బంగారు కల కరిగిపోయింది. ఎన్నో తీయని ఊహలు పక్వానికి రాకుండా పులుపుకాయలుగానే రాలిపోయాయి. ఎంతో మధురంగా, అమృతమయంగా పండించదలచిన బ్రతుకు పంట ఎందుకూ కొరగాకుండా పోయింది బ్రతుకే పులిసిపోయింది. ఒక తియ్యని ఆలోచన, ఒక కమ్మని భవిష్యత్తు లేకుండా జీవితాంతం ఎలా గడపడం? హాయిగా ఆనందంగా ఒక చిరునవ్వైనా లేకుండా ఈశిక్షేమిటి తనకు?

అతనికి తెలీకుండానే కన్నీరు చెంపలమీంచి జారిపోయింది.

ఆ రాత్రి అతను నిద్రపోనేలేదు.

ఉదయం హాస్పిటల్‌కి వెళ్ళేప్పుడు బావమర్దిని పంపి యింటికే రిక్షాతెప్పించుకుని వెళ్ళాడు. మధ్యాహ్నం భోజనానికి రాలేదు హోటల్లో తినేసి వచ్చాడు. రజనీ 'ఆకలిగా లేదు. తినలేను' అంటే "చూడు...అసలే నీరసంగా వున్నావు. అన్నం తినకపోతే మరీ నీరసపడిపోతావు. తిను" అన్నాడు.

ఆమెకు కన్నీళ్ళు తిరిగాయి. రెండుమూడు బొట్లు టపటపా రాలిపడ్డాయి.

ఆమె ఎందుకు కళ్ళనీళ్ళు పెట్టుకుంటోందో అతనికి అర్థమైంది. ఇంతకుముందు ఎప్పుడైనా ఆమె అన్నం తిననంటే దగ్గరుండి ప్రేమతో బుజ్జగించి, కబుర్లు చెప్పి మురిపించి, అభిమానంతో కోప్పడి చిన్నపిల్లలా అమెను బెల్లించి తనూ చిన్నపిల్లవాడై ఆమె అన్నంతినేవరకు వేధించుకుతినేవాడు. కూర్చున్న స్థలంలోంచి ఆమె లేవలేకపోతే బలవం

తంగా చేతులమీద ఎత్తిపట్టుకొని లాక్కొచ్చేవాడు. అలా అతనిచేత ఎత్తించుకోవాలనే ఆమె ఫోంచేయనని అప్పుడప్పుడు మొరాయించేది.

ఆ దృశ్యాలే ఆమె కళ్ళముందు తిరిగుండాలి.

నాగభూషణం కళ్ళల్లోనూ అవే దృశ్యాలు.

దొరికిపోయిన దొంగలాగ నాగభూషణం ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు. మెల్లగాలేచి ఆమెను మంచంమీద లేవనెత్తి కూచోబెట్టాడు. నూలుదగ్గరగా జరిపి టిఫిన్ కేరియరు దానిమీద పెట్టాడు. "చూడు రజనీ; ఎలాగోఒకలా హితవు చేసుకుని అన్నం తినాలి.లేకపోతే మరీ నీరసంగావుంటుంది.తిను ...నువ్వుతినకపోతే నామీదఒట్టే'' అన్నాడు.

అతనికి ఒట్టుమీద నమ్మకంలేదు. అది ఆమెకు తెలుసు. తను తనలాగ మాట్లాడ లేకపోతున్నానని అతనికికూడా తెలుసు.

ఆమె ఎంగిలిపడి మానేసింది. ఆమెను మరిక బలవంతం చేయలేక పోయాడు.

సాయంకాలం వరకు అక్కడవుండాలంటే నాగభూషణానికి బోర్‌గా అనిపించింది. అలా వెళ్ళొస్తానని చెప్పి దగ్గరలో సినిమాహాలు వుంటే మేట్నీకివెళ్ళాడు. సినిమా చూసే మూడ్ కూడాలేదు. హాస్పిటల్లో పరాయివాళ్ళముందు కూచున్నట్టు కూచోవడం చాలా ఎబ్బెట్టుగా వుంటుంది. బైటికొచ్చి ఊళ్ళో పట్టపగలు తిరగాలంటే ఏమిటోలావుంది. చీకటి పడే వరకు ఎలాగోలా గడపడం కావాలి.

హాల్లో కూచున్నాడేగాని ఆలోచనలు అక్కడలేవు. ఇంటర్‌వల్ వరకు ఏదో విధంగా గడిపినా ఆ తర్వాత నిద్రపోయాడు. సినిమా విడిచిపెట్టేక ఎవరో నిద్రలేపితే లేచాడు. హోటల్లో కాఫీతాగి హాస్పిటల్‌లో పావుగంట వుండి యింటికి వెళ్ళిపోయాడు.

రాత్రి మామగారితో, మర్నాడు తాను వెళ్ళిపోతానంటే మరో రోజు వుండమన్నారు ఆయన. మర్నాడే రజనీని యింటికి తీసుకొచ్చేస్తున్నారట. ఆ మరుసటి రోజు వెళ్ళొచ్చన్నారు.

మర్నాడు ఉదయం రజనీని తీసుకురావడానికి మామగారితోపాటు నాగభూషణం కూడా హాస్పిటల్‌కు వెళ్ళాడు. రిక్షా దొరక్కపోతే కొంతదూరం నడిచివెళ్ళక తప్పింది కాదు. తలవంచుకుని నడుస్తున్నాడు.

తెలిసిన వారెవరో వాళ్ళ మామగారిని పలకరించారు. అమ్మాయి ఆరోగ్యం గురించి పరామర్శిస్తున్నాడు ఆ వ్యక్తి. వీధిమధ్య నిలుచుని మాట్లాడుతున్నారు.

నాగభూషణానికి తలకొట్టేసినట్టుగావుంది. మెల్లగా తల పైకెత్తాడు. కుళాయినుంచి నీళ్ళుపట్టుకొస్తున్న ఒకామె అతన్నే పట్టిపట్టి చూస్తోంది. అతను తల పైకెత్తి చూడ్డంతోనే చూపు తప్పించేసింది. అతను యిటు పక్కకు చూశాడు. అక్కడ యింటి అరుగుమీద కూచుని మాట్లాడుకుంటున్న యిద్దరు పెద్దమనుషులు, అంతవరకు అతనినే నిదానించి చూస్తున్నవారల్లా అతను అటు చూడ్డంతోనే మరోవైపు ముఖాలు తిప్పేశారు. నాగభూషణం తలెత్తి అటూ యిటూ చూస్తున్నాడు. అంతవరకు ఓయింటి తలుపుదగ్గర నుంచుని చూస్తోన్న ఓ అమ్మాయి అతను చూస్తోంటే లోపలికి వెళ్ళిపోయి తలుపు వేసుకుంది.

అక్కడనుంచి వాళ్ళు కదిలినప్పుడు మరిక నాగభూషణం తలవంచుకుని నడివడ లేదు. తలెత్తి అటూ యిటూ చూసుకుంటూనే వెళ్ళాడు

హాస్పిటల్‌కి వెళ్ళాక డాక్టరు గారితో మాటాడి వస్తానని మావగారు డాక్టరు రూం వైపు వెళ్ళారు. నాగభూషణం నేరుగా వార్డులోకి వచ్చాడు.

రజనీ యింకా మంచంమీదే వుంది. అత్తగారు సామాను సర్దుతున్నారు. మంచం దగ్గరకు వచ్చాడు రజనీ అటుతిరిగి పడుకు నివుంది. "ఇంకా పడుకునే వుందేమిటి, లేపి కూచోబెట్టండి. మావగారు డాక్టరుగారితో మాటాడానికి వెళ్ళారు రాగానే యింటికి వెళ్ళి పోవచ్చు" అన్నాడు నాగభూషణం అత్తగారితో.

"లేమ్మా ...లేచి కూచో. అబ్బాయివచ్చాడు" అంది. దగ్గరకొచ్చి లేవదీసి కూచో బెట్టింది. కూతురు చెక్కిళ్ళమీద కన్నీటి చారికలువుంటే కొంగుతో తుడిచింది.

తడిసిన తలగడను నాగభూషణం చూశాడు.

"రోజల్లా యిలా ఏడుస్తూ కూచుంటే యిక ఆరోగ్యం ఏం బాగుపడ్తుంది!'

లాలనగా అనబోయిన అతనికంఠం కసురుకొన్నట్టు వినిపించింది అతనికే. ఆ వెంటనే మళ్ళీ "అలా ఏడవగూడదు రజనీ. ఏడిస్తే నీ ఆరోగ్యం మరీపాడై పోతుంది." అన్నాడు.

ఆమె ఉబ్బిన కళ్ళతో కొద్దిక్షణాలు అతన్నే చూస్తూ వుండిపోయింది. అలాచూస్తోన్న ఆమె కళ్ళల్లోంచి కన్నీరు జలజలా కారిపోయింది. వాళ్ళమ్మ మందలిస్తూ కన్నీరు తుడిచింది. అతను మౌనంగా చూస్తూ వుండిపోయాడు.

మావగారు వచ్చి, వెళ్ళిపోవడానికి టేక్సీ ఏర్పాట్లు చేస్తున్నారు. నాగభూషణం ఒకసారి డాక్టరును కలిసి చెప్పి వద్దామని వెళ్ళాడు.

'చూడండి నాగభూషణం గారూ! ఆవిడ విషయంలో చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి సుమండీ. ఆమె మనసుకు ఏమాత్రం బాధ కలిగినా తట్టుకోలేదు. చాలా వీక్‌గా వుంది. ఏవిధంగానూ ఆమెకు మనస్తాపాన్ని కలిగించకూడదు. ఆమె మనసుకు తగిలిన యీ గాయం మానేవరకు ఆవిడ రోగికిందే లెక్క. ఆ విషయం యింట్లో వాళ్ళంతా ఎప్పుడూ గుర్తుంచుకోవాలి' అన్నాడు డాక్టరు.

తలవూపి ఆయన దగ్గర సెలవుతీసుకుని వచ్చేశాడు.

టేక్సీలో యింటికి వస్తోంటే డాక్టరు చెప్పిన మాటలు అతని చెవుల్లో మాటి మాటికి వినిపిస్తున్నాయి.

డాక్టరు అలా ఎందుకు చెప్పాడో తను అర్థంచేసుకోలేకపోలేదు. ఆమె విషయంలో చాలాజాగ్రత్తగా వ్యవహరించాలంటే అర్థం ఆమెకు బాధకలిగించొద్దని. ఎందువల్ల ఆమెకు బాధ కలుగుతుందో డాక్టరుచెప్పకపోయినా తనకు తెలుసు. ఆయన అలా వూహించడం అసహజమేమీ కాదు. తను ఒక సామాన్యుడు. రాగద్వేషాలకు అతీతంకాని అతిసాధారణమైన మనసు తనది. ఇలాంటి మనసు ఉన్నతంగా ఎలా ఆలోచించ గలుగుతుంది! తను

ఒక మహాత్ముడిలాగ ఎలా ప్రవర్తించగలడు? ఏ ప్రత్యేకతాలేని, ఏ గొప్పతనమూలేని అతిసాధారణమైన మామూలు మనిషి తను.

నాగభూషణానికి గత రెండు రోజులుగా మాటిమాటికి యిద్దరు వ్యక్తులు గుర్తుకొస్తున్నారు. వాళ్ళను గురించి ఆలోచించడం అతనికి యిష్టంలేకపోయినా వాళ్ల అస్తమానం గుర్తుకొస్తూనే వున్నారు. ఇప్పుడుకూడా గుర్తుకొచ్చారు.

అతని కళ్ళల్లో ఎప్పుడో చిన్నప్పుడు వాళ్ళ వీధిలోవుండే రాములు కదిలాడు. రాములు ఓ అల్యూమినియం కంపెనీలో పోతపోసిన పాత్ర సామానులకు తరిమెనపెట్టే కార్మికుడు. తన భార్య మరొకరితో తిరుగుతోందని తెలిసి చావగొడితే, ఆమె పుట్టింటికి పారిపోయి రెండు నెలల తర్వాత వచ్చినప్పుడు, ఏమీ జరగనట్టే అన్నీ మర్చిపోయి ఏలుకున్నాడు. రాములు మహాత్ముడు కాడు. మామూలు మనిషి.

నాగభూషణం రాముల్ని గురించి ఆలోచించాడు.

అతని కళ్ళల్లో మరోవ్యక్తి కూడా కదిలాడు. వాళ్ళ ఆఫీసులో లోగడ పనిచేసి మానేసిన వహీదున్నీసాబేగం భర్త అతను. వహీదున్నీసా కొంతకాలంక్రితం ఓ కేసులో చిక్కుకున్నట్టు ఆఫీసులో చెప్పుకున్నారు. పోలీసురైడింగ్‌లో ఓ హోటల్లో పట్టుబడిందట. అప్పట్లో పోలీసులు ఆఫీసుచుట్టూ నాలుగైదు సార్లు తిరగడం చూసికూడా అదే సెక్షన్‌లో పనిచేస్తున్న ఓ యుడిసి ఆమెను పెళ్ళిచేసుకున్నాడు. వాళ్ళకు యిప్పుడు యిద్దరు పిల్లలు కూడా. ఆ యుడిసి హుస్సేనీ మహాత్ముడు కాదు. అతి సాదావ్యక్తి.

నాగభూషణం హుస్సేనీ గురించి ఆలోచించాడు.

'రాములు, హుస్సేనీ తనలాటివారే. తనకన్నా సామాన్యులే. కాని—'

నాగభూషణం ఆలోచనలు టేక్సీతోపాటు ఆగిపోయాయి.

గుమ్మం ముందు ఆగిన టేక్సీని, అందులోంచి దిగుతోన్న రజనిని వీధివీధంతా చూస్తున్నా నాగభూషణం ఆమెకు చెయ్యి ఆసరాయిచ్చి మెల్లగా మెట్లు ఎక్కించి లోపలికి తీసుకెళ్ళాడు.

ప్రభ ఎదురొచ్చి పలకరిస్తే ఆమెను కావలించుకుని ఘొల్లున ఏడ్చేసింది రజని. ఎంతకీ ఆమె ఊరుకోకపోతే నాగభూషణమే కల్పించుకుని గదిలోకి తీసుకెళ్ళి మంచంమీద కూచోబెట్టాడు. జేబురుమాలుతో ఆమె కన్నీటిని తుడిచాడు. ప్రభ రజనీకని కాఫీ పట్టుకొస్తే తనే అందుకుని చల్లార్చి ఆమెకు పట్టాడు.

ఆమె ఉలుకూ పలుకూ లేకుండా అతను చేసే ప్రతిచర్యా నీళ్లనిండిన కళ్ళతో చూస్తూ, నిర్లిప్తంగా అతను చెప్పినట్టు చేస్తోంది.

ఆమె అలా చూస్తోంటే నాగభూషణానికి గుండె దేవినట్టుగా వుంది. ఎప్పుడూ కలకల్లాడుతూ కబుర్లు చెపుతూవుండే ఆమె చలాకీతనం యిప్పుడు లేదు పాడైపోయిన రేడియోలా దిగాలుగా వుంది ఆమె. గూడు వొదిలిన పక్షిలా చిరునవ్వు ఎటో ఎగిరిపోయింది, కళ్ళల్లో వెలుగులులేవు, మబ్బేసినట్టు మసకబారిపోయాయి. ఆగిపోయిన

గోడగడియారంలా ఉందామె. క్షణం తీరికలేనట్టు ఏదో ఒక పనిచేస్తూనేవుండేది ఎప్పుడూ. ఆ చైతన్యం, ఆ ఉత్సాహం యిప్పుడు ఏ మరలోనో చిక్కుకుపోయాయి గాబోలు. ఏ తుప్పుపట్టిన చక్రంలోనో ఘనీభవించిపోయివుండాలి. ఆ రజనీకి, ఈ రజనీకి ఎంతతేడా! అప్పుడామె వర్షాకాలంలో కొండవాగు. ఇప్పుడు ఎండిపోయి యిసక డొక్కల్తో దైన్యాన్నంతా నింపుకున్న వేసవి వాగు.

నాగభూషణం ఓ అయిదు నిమిషాలు ఆమె పక్కనే మంచంమీద కూచుని 'కాస్సేపు పడుకుని రెస్టు తీసుకో' అని చెప్పి వచ్చేశాడు. నడవాలో భోజనాల టైమువరకు న్యూస్‌పేపరు తిరగేస్తూ వుండిపోయాడు.

భోజనంచేసి ఈజీఛైర్‌లో అలా జేరబడితే నిద్రపట్టేసింది. లేచేసరికి మూడయ్యింది. ముఖం కడుక్కుందామని తువ్వాలు గురించి రజనీవున్న రూములోకి వెళ్ళాడు. మంచం మీద గోడకు జేరబడి ఏదో రాసుకుంటున్న రజనీ అతని అలికిడి విని చటుక్కున రాయడం ఆపేసి కాగితాన్ని తలగడకింద పెట్టేయడం నాగభూషణం చూశాడు గాని, అట్టే పట్టించుకోలేదు. బాత్‌రూంలో సబ్బుతో ముఖం రుద్దుకోబోతూ చటుక్కున ఆగి పోయాడు.

మనసులో ఏమూలో కదిలిన చిన్న ఆలోచన మనసంతా తరంగాలుగా చుట్టేసి అల్లుకుపోయింది. అతను సబ్బునీ, నీళ్ళ చెంబునీ అక్కడ పడేసి హడావుడిగా ఆమె గదిలోకి వచ్చాడు. ఆమె చేతిలో కాగితాలు లేవుగాని పెన్నుమాత్రం కేప్ తెరచేవుంది. చేతిలోని పెన్నుని చాలా తాపీగా కిందపెట్టి పక్కన గ్లాసులో నీళ్ళంటే తీసుకొని తాగింది.

నాగభూషణం తువ్వాలు పెట్టడానికి వెళ్లినట్టుగా అక్కడ పడేసి చొక్కా వేసుకొని యివతలికి వచ్చేశాడు. నడవాలోనే ఈజీఛైరులో న్యూస్‌పేపరూ, వారపత్రికా చూస్తూ వుండిపోయాడు. ఇంట్లోవాళ్లు మధ్యాహ్నం కాస్సేపు ఓ కునుకుతీసి యిప్పుడే లేచి టిఫిన్లు చేసే ప్రయత్నంలో వున్నారు. మావగారు యింకా నిద్రలేవలేదు. కోటి మధ్యాహ్నం అసలు యింట్లోనే లేడు.

రజనీ బాత్‌రూమ్‌కని గాబోలు దొడ్లోకివెళ్లింది. ఆమె తిరిగివచ్చేసరికి నాగభూషణం గదిలో తలదువ్వుకుంటున్నాడు. ఆమె మామూలుగా వచ్చి పడుకుంది. నాగభూషణం మంచంమీదకూచుని, అటు తిరిగివున్న ఆమెను తనవైపు తిప్పుకున్నాడు. ఆమె కళ్ళల్లోకి చూస్తూ—

"రజనీ రేపు ఉదయం నేను వెళ్ళిపోతున్నాను. నీ వంట్లోబాగా స్వస్థత చేకూరాక వుత్తరం రాస్తే వచ్చి తీసుకెళ్తాను. నీకు తెలుసుకదా నేను వంటరి వాడ్నని. నువ్వులేక పోతే నేను పిచ్చివాడ్నయిపోతాను. నాకు శాశ్వతంగా దూరమై నన్ను పిచ్చివాడ్ని చేయనని చెప్పు. నువ్వేమీ తప్పుచేయలేదు. బుద్ధిపూర్వకంగా నువ్వుతప్పు చేయనప్పుడు ఎందుకలా బాధపడ్తావు. చచ్చిపోదామనుకోడం శుద్ధ తెలివి తక్కువ. అలాటి పిచ్చిపిచ్చి ప్రయత్నాలు చేయనని మాట యివ్వు. అంత ఘోరంగా నన్ను శిక్షించొద్దు రజనీ..."

రజనీ తలగడ కింద చెయ్యిపెట్టి చూసింది. అక్కడవుంచిన కాగితం చేతికి తగల్లేదు. చివాల్న లేచికూచుని తలగడ తీసింది. కాగితం లేదు. నాగభూషణం జేబులోంచి అసంపూర్తిగా రాసివున్న ఓ కాగితం తీసి ఆమె కళ్ళ ఎదుటనే ముక్కలుముక్కలుగా చించేసి కిటికీలోంచి అవతలికి విసిరేశాడు.

"ఈ వుత్తరం నేను చూసుండకపోతే ఏ రాత్రి వేళో నువ్వు…"

అతను యింకా మాట పూర్తిచేయనేలేదు, రజనీ భోరున ఏడుస్తూ అతని గుండెలకు అతుక్కుపోయింది.

అనంత
17081З







సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
నవలాస్యం చేయాలని
యువభారతి లక్ష్యం!
సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది

సాహిత్యకళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకూ, వివరాలకూ

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3**

యువభారతి సాహితీచైతన్యంతో పదోవసంతం ప్రచురణలు

**వసంత లహరి**

**మందార మకరందాలు**